# రవీంద్ర స్మృతి





స్వర్గీయ ఆలపాటి రవీంద్రనాథ్, ఇళాపతి రవీంద్రనాథ్



సమర్పణ :

**రవీంద్ర మిత్రులు**

A Tribute in letters from Friends and family in memory of their Beloved Alapati Ravindranath

☆

# రవీంద్ర స్మృతి

☆

సంపాదకుడు: సహవాసి

☆

నవంబరు, **2001**

☆

ప్రతులు : **1000**

☆

ముఖపత్రం : చంద్ర

☆

అమూల్యం

☆

© & ముద్రణ :
కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్
1-1-60/5, ఆర్.టి.సి క్రాస్ రోడ్స్
ముషీరాబాద్, హైదరాబాద్ - 500 020

☆

# ప్రశంసా వాక్యాలు

బెజవాడ గోపాలరెడ్డి,
(ఉత్తర ప్రదేశ్ గవర్నర్
1967-72)

65064

"శాంతి నికేతన్
వెల్లూరు-3
16-7-1985

వింజమూరి సీతాదేవి, ఇటీవలనే పదవీ విరమణ చేశారు. ఆమె ఉద్యోగ జీవితమంతా జానపద సంగీత గేయాలను సేకరించడంలోనే గడచింది జానపద సాహిత్యము, సంగీతము మన అమూల్య సంపద శతాబ్దములుగా నోటినుండి నోటికి ధ్వనించుచూ, ప్రతిధ్వనించుచూ వచ్చిన, సౌభాగ్యము చదువురాని పల్లె సీమలలో బ్రతికి యుండిన సాహిత్యము, సంగీతము, అపారమైనవి, భూమికి అంటుకుని యుండినవి. నాగరికులకు అవి అందరాని ముత్యాలు గానే వుండినవి ఈశతాబ్దములో, జానపద సాహిత్యమును గురించి కొన్ని విశ్వవిద్యాలయాల్లో పని జరుగుతూనే వున్నది సంగీత విషయమై అంత విరివిగా కృషి జరగలేదు ప్రప్రధమంగా పాడి, ప్రచారము చేయటంలో కృషి చేసిన వారు, సీతా అనసూయగారలు జంట అష్టావధాన కవుల వలె, ఈ వింజమూరి సోదరీమణులు, జిల్లాలలో ప్రచారం చేశారు చాలా ఏండ్లుగా జానపదుల దేశీయ స్వర విధానాన్ని గమనించి, అదే విధానంగా పాడి, రేడియో, రికార్డులు ద్వారా వ్యాప్తంలోకి తెచ్చిన మనత ఈ సోదరీమణులకే దక్కుతుంది.

సేకరణ విషయంలో, అపారమైన కృషి చేసే అవకాశం దాదాపు 25 సంవత్సరాలుగా ఆకాశవాణి జానపద సంగీత

నిర్వాహకురాలిగా, సీతాదేవికి లభించింది ఎక్కడో మారుమూల గ్రామాలకు పోయి, పాటలను విని, వాటి మాటలను వ్రాసుకుని, వాటి స్వర విధానమును గమనించి, కొన్ని వందలూ వేలూ పాటలు సభ్యతా ప్రపంచమునకు అందక మారుమూల దాగి యుండిన మాణిక్యములను సేకరించి అందచేశారు దాదాపు ఆంధ్ర ప్రదేశ్ లోని అన్ని జిల్లాలలో తిరిగారు పల్లెసీమల జనుల ఆదర సహకారాలను పొందారు

సీతా అనసూయ గార్లను నేను మొదట కాకినాడలో, 1936 లో డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు పరిచయము చేయునప్పుడు చూడడం, వారి సమక్షంలో వీరు పాడినప్పుడు వినడము జరిగినది అంటే, దాదాపు 50 ఏళ్ల పరిచయం, వీరితో, వీరి కంఠ మాధుర్యంతో వీరు నా స్నేహితులు, పూజ్యులు, కీర్తి కాయులూ అయిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మేనకోడళ్లు అవుటచేత మరింత సన్నిహితులైనారు వారి పాటలనుతమ సంగీతము ద్వారా, రేడియోప్రసారముల ద్వారా ప్రచారములోకి తెచ్చారు అనేక నగరాలలో పాడి, ప్రజల రంజింప చేశారు రాష్ట్రపతి భవనంలో రాజేంద్రప్రసాద్, డా॥ రాధాకృష్ణన్ సమక్షంలో పాడి, వారికి సంతోషమునూ ఆశ్చర్యమునూ కలిగేటట్టు చేశారు జీవితాన్నే దీనికి కైంకర్యము చేసినారా అనిపిస్తుంది

ఇప్పుడు సీతాదేవి ఈ గేయాలను కొన్ని సంపుటాలుగా, శీర్షికల క్రింద విభజించి ప్రచురించ పూనుకొనడం చాలా ప్రశంసనీయమైన పని. ఈ కృషికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తగు రీతి సహాయము చేయగలవని ఆశించు చున్నాను ఈ ధార, కాలపు ఎడారులలో ఇంకిపోకుండా చూడవలసిన బాధ్యత అందరి మీదనూ కలదు ఈనాడు ప్రచురణ కాబోయే ఈ సంపుటాలు ఆంధ్రుల మన్నన పొందకలవని ఆశిస్తున్నాను

బెజవాడ గోపాలరెడ్డి

# అభినందన

డాక్టర్ సి నారాయణరెడ్డి 6-3-845, సోమాజీగూడా
ఎమ్. ఏ పి.హెచ్‌డి, డి లిట్ హైదరాబాద్-500 482
వైస్ ఛాన్స్‌లర్ - ఆంధ్రప్రదేశ్ 9 - 9 - 1985
ఓపెన్ యూనివర్సిటీ

వింజమూరి సోదరీమణుల్లో ఇటు సీత-అటు అనసూయ, లలిత సంగీత ఝురికి రెండు గట్లు. వాళ్లు ఇద్దరుగా పుట్టారు కాబట్టి, రెండు గట్లని అన్నాను నిజానికి వారి ప్రతిభ అవిభాజ్య జీవధార

సీతాదేవి ఏళ్ల తరబడిగా ఏరుకున్న పల్లెపాటల రాసులు బళ్లకందేనా? విడమరిచి పాడాలంటే వేయి గొంతులు చాలేనా ?

'లాలి – తాళి-' తాను సేకరించిన జానపదగేయాల మొదటి సంపుటి పేరు. ఎంత బాగా కుదిరింది. మనిషి జీవితంలో రెండే ముఖ్యమైన ఘట్టాలు. పుట్టుక, పెళ్ళి. ఈ రెంటిని రెండు ముక్కల్లో ఎంత నిండుగా కుదించారో రచయిత్రి.

మామూలుగా జానపద గేయాల సంపుటుల్లో బాగా నలిగినవే ఉంటాయి. ఈ సంపుటిలోవి జానపదుల నోళ్లలో నలిగినవే అయినా మన చెవులకెక్కనివి చాలా ఉన్నాయి.

సీతాదేవి సేకరించి కూర్చిన ఈ పాటలు జానపద గేయ పేటికలో భద్రపరిచిన పగడాలు. అందుకు నా అభినందన.

సి. నారాయణరెడ్డి

# ... ని వే ద న ...

రవీంద్రనాథ్‌గారితో పరిచయం ఓ పరిమళం ...

ఆలంకారికంగా చెప్పటంలేదు. అనుభూతి పూర్వకంగా చెబుతున్న మాట.

అది చిరపరిచయమే కానక్కరలేదు చిరు పరిచయమైనాసరే, చెరగని ముద్రగా మిగిలిపోతుంది. ఆయన ఆర్ద్ర మనస్కత, సౌహార్దం, సంస్కారం, సౌజన్యం తలపునకొస్తాయి. అంటే అది మామూలు పరిమళం కాదు; సౌహృద సౌరభం.

ధమ్మపదంలో బుద్ధుడు ఒక కమ్మని మాట చెప్పాడు:

> ''సత్పురుషుల మంచితనం
> ఝంఝూనిల ధాటి కాగి
> దిగంతాల పర్యంతం
> సుగంధాలు పంచుతుంది''

అంటే సత్పురుషుడు సర్వదిశలా వ్యాపిస్తాడు. (''సబ్బాదిసా సప్పురిసో పవాతి'' – పాళీ) కాబట్టే రవీంద్రనాథ్‌గారు ఎందరికో ప్రియతము డయ్యారు. ప్రియబాంధవుడయ్యారు. ప్రభుత్వంలో ఉన్నత స్థానాలు అధిరోహించిన బెజవాడ గోపాలరెడ్డిగారు, రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి గారు, ప్రధాన న్యాయమూర్తులు శ్రీ ఆవుల సాంబశివరావు, శ్రీ జయ చంద్రారెడ్డి, శ్రీ కోకా రామచంద్ర రావు, కవి, సాహితీ మేరువు ఆచార్య సి. నారాయణరెడ్డి, డాక్టర్ జి.వి. కృష్ణారావు, గోపీచంద్, సంజీవదేవ్, ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అధికారులు, ప్రసిద్ధ రచయితలు, మేధావులు రవీంద్రనాథ్‌గారితో తమ పరిచయాన్ని అమూల్యంగా భావించారు. జీవితాంతం గుర్తుంచుకున్నారు. అనేక విషయాల పై చర్చించారు. అభిప్రాయాలు కలబోసుకున్నారు. సమాజంలో పెద్ద హోదాలో వున్నవారే కాదు, సామాన్యులూ ఆయనకు స్నేహితులు, సన్నిహితులు అయ్యారు. వయస్సులో, అనుభవంలో సమవుజ్జీలు కాని వారితోనూ ఆయన చెలిమి చేశారు. మైత్రి నెరపారు. చనవుగా మెలిగారు. తరాల అంతరాలనే కాదు, హోదా, పేరు, పలుకుబడి, సామాజిక స్థాయి ఇత్యాది తేడాలను కూడా అధిగమించిన సౌహృదానికి రవీంద్రనాథ్ ప్రతీక. డాక్టర్ సి. నారాయణరెడ్డి గారంతటివారే ''పరిమళిస్తున్న ఆ స్మృతులను అక్షరాల ద్వారా

# పరిచయం

**పాలగుమ్మి విశ్వనాథం**
**రిటైర్డ్ లలిత సంగీత నిర్వాహకుడు**
**ఆల్ ఇండియా రేడియో**

**హైదరాబాద్**
**18-9-1985**

సుమారు పది పదిహేను సంవత్సరాల క్రితం వరకు ఆంధ్ర దేశంలో ఇంటింటా ఎంతో చనువుగా, ఆప్యాయంగా తలుచుకునే పేర్లు అనసూయ - సీత ఈ నాటికి కూడా కొందరు అడుగుతుంటారు "వీళ్ళల్లో సీత ఎవరు అనసూయ ఎవరు" అని. విడదీయలేనంతగా కలిసిపోయి పెరిగిన సంగీతపు జంట యిది. ఏవో సుందర ఉధ్యానవనాల్లో విహరిస్తూ కొత్త సువాసనలు వెంట తెచ్చుకున్న సీతాకోక చిలుకల్లాగ కన్పించేవారు వీళ్ళు-ఆరోజుల్లో. వీళ్ళపాట విని, మతులు పోగొట్టుకున్నవారు ఉన్నారు, కవిత్వాలు వ్రాసిన వారున్నారు.

శాస్త్రీయ సంగీతానికి భిన్నమైన ఒక సంగీతానికి రూప కల్పనజేసి, అది ప్రజలు వినేట్టుచేసి దానికి సభాగౌరవం కలిగించిన ఘనత వీరికే దక్కుతుంది. ఆరోజుల్లో వింజమూరి సోదరీ మణుల పాటలేని సభలు గాని సమావేశాలుగాని బహు అరుదు.

స్వాతంత్ర్య భావాలతో జాతి మేల్కొన్న సమయంలో, ప్రముఖ భావ కవుల కలాల్లోంచి ఉరకలువేస్తూ కొత్త పోకళ్ళతో వచ్చిన ప్రతిగీతం అనసూయ సీతల గళాల్లో మార్మోగి, సార్థకం అయింది అందుకే మేనమామ కృష్ణశాస్త్రిగారి పాటలు వీళ్ళ నిక్షేపాలు

అనసూయ సీతలకి కొన్ని అదృష్టాలు కలిసివచ్చాయి ఒక ప్రక్క పండితుడు, నాటకర్త, సహృదయుడు అయిన తండ్రి నరసింహారావుగారు మరోప్రక్క మేరువులా మేనమామ కృష్ణశాస్త్రి. కాకినాడలో సాయంకాలాలు వీళ్ళ ఇల్లు దర్బారులా ఉండేది.

కృష్ణశాస్త్రిగారు సభాపతి   వివిధ రంగాల్లో ప్రముఖులు కొలువు తీర్చేవారు. సంగీత విద్వాంసులు మునుగంటి వెంకట్రావుగారు. జానపద సంగీత పితామహుడు వల్లూరి జగన్నాధరావుగారు, శివ శంకరశాస్త్రిగారు. అడివి బాపిరాజుగారు - ఇల్లా ఒకరేమిటి? కవులు కళాకారులతో కలకల్లాడుతుండేది భవిష్యత్‌ని ఎంతో ఆశతో, నమ్మకంతో ఊహించుకొనే రోజులవి కొత్త ఉత్సాహం తొణికిసలాడే రోజులవి కొత్తకవితలు మొదట అక్కడే వినిపిస్తుం డేవి. మధ్య మధ్య అనసూయ సీత పాటలతో నిత్యకల్యాణం పచ్చతోరణంలా ఉండేది మునుగంటి వెంకట్రావుగారి వలన శాస్త్రీయ సంగీతంలోనూ, వల్లూరి జగన్నాధరావుగారి వల్ల జాన పద సంగీతంలోనూ వీళ్ళిద్దరికి అభిరుచి ఏర్పడింది.

ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రంలో సీతాదేవి జానపద సంగీత శాఖను చేపట్టి నప్పటినుంచీ, ఆమె జీవితంలో కొత్త మలుపు వచ్చింది జానపద సంగీతానికి మంచిరోజులు వచ్చాయి. ఎక్కడో మారు మూలల్లో మరుగున పడిపోయిన జానపద సం గీతం వెలుగులోకి రావడం మొదలైంది అమాయకులు పాడుకునే అనాగరికమైన పాటలుగా జమకట్టబడి, పల్లెపట్టులకే పరిమితమై పోయిన ఈ జానపద సంగీత సంపదవైపు పట్నవాసుల దృష్టి మరల్చింది సీతాదేవి ఆకాశవాణి ద్వారా  ఎంతోమంది జానపద గేయాలు సేకరించారు. ఎన్నో సంకలనాలు వచ్చాయి జానపద గేయాలకు ప్రాణం. వాటికి నీడగా అంటిపెట్టుకున్న సంగీతం. సహజమైన సంగీత కవచంతో ఆవిర్భవించిన పాటలు జానపద గేయాలు. అల్లాంటి సజీవమైన జానపదగేయాలని ఆంధ్ర ప్రజా నీకానికి అందించిన ప్రత్యేకత సీతాదేవిది.

ఒక టేప్‌రికార్డర్‌ని, ఒక ఇంజనీరుని వెంటబెట్టుకొని, ఆంధ్ర దేశంలో మారుమూల ప్రాంతాలకు వెళ్ళి, ఎన్నోగేయాలు యధా తధంగా సేకరించింది సీతాదేవి. ఇందులో ఎన్నో ఇబ్బందులు

ఎదురైయేవి. జానపదులు కొత్తవాళ్ళ దగ్గర పాడమంటే బిగుసుకు పోతారు. వాళ్ళ పరిసరాల్లో హాయిగా పాడుకుంటారు. అల్లా వాళ్ళు పాడుకుంటూంటే వింటేనే వాటిరుచి తెలుస్తుంది వాళ్లసహజ ధోర ణిలో పాడేలా చేయడానికీ ఎంతో ఓర్పు, నేర్పు కావాలి వాళ్లతో చనువు పెంచుకోవాలి వాళ్ల జీవన విధానం మీద సానుభూతి ఉండాలి. వాళ్ళు మాట్లాడే భాషలో వారికి చేరువ కావాలి ఒక్కొ క్కప్పుడు వాళ్ళు పాడేపాటలో మాటలు తెలియవు. జానపదుల పలు కుబళ్ళు తెలిసుండాలి, మాండలికాలతో పరిచయం ఉండాలి సంగీత జ్ఞానం ఉండాలి. ఈ లక్షణాలన్నీ సీతాదేవికి దండిగా ఉన్నాయి.

అన్నిటికంటే పెద్ద ఇబ్బంది ఇంకొకటి ఉంది ఒక రకమైన శీతోష్ణ పరిస్థితులలో ఏపుగా పెరిగిన మొక్క, ఇంకో వాతావరణంలో నాటితే, వడగొట్టి వాడిపోవచ్చు అలాగే ప్రశాంత వాతావరణంలో, పల్లెపట్టులతో సహజ మాధుర్యంతో వినబడే జానపదగేయం, నాగ రిక వాతావరణంలో శిక్షణపొందిన గాత్రాల్లో పడితే, వాటి అసలు అందం అడుగున పడిపోయి, పల్లెపడుచుకు పట్టుచీరగట్టి ఏడు వారాల నగలు తొడిగినట్టు ఉండే ప్రమాదం ఉంది ఈ ప్రమా దంలో పడకుండా, అవి పాడడానికి అనువైన గాత్రాలను ఎంచు కొని, ఆ పాటల సహజమైన అందచందాలు వెదజల్లుతూ ఆకాశ వాణి ద్వారా ఎన్నో పాటలు సమర్పించింది సీతాదేవి. అవన్నీ ఆధునిక శ్రోతలకు కూడా దగ్గరగా వచ్చి, ఎంతో ప్రచారం పొం దాయి ఇల్లా ఎంతో శ్రమపడి, సేకరించి ప్రచారంలోకి తెచ్చిన జాన పదగేయ సంపద, సీతాదేవి పుస్తకరూపంలో మనకి అందిస్తున్నది.

తన 25 సంవత్సరాల కృషి ఫలితాన్ని ఆంధ్ర ప్రజానీకం హర్షించి ఆదరిస్తారని నా నమ్మకం

ఈ సంకలనంతోపాటు, ఆ పాటల కాసెట్ కూడా జత పరిస్తే బంగారానికి తావి అబ్బినట్టు ఉంటుంది

**పాలగుమ్మి విశ్వనాథం**

65064

# సుమాంజలి

రిటైర్ అయిన రోజున, ఇకముందు నేనేం చెయ్యాలి అనే ఆలోచన కలిగింది. నాకు జ్ఞానం వచ్చిన దగ్గర నుంచీ మా అక్కయ్య, కళాప్రపూర్ణ అనసూయాదేవితో కలిసే పాడడం అలవాటై పోయింది. అందుకే, ప్రజల్లో మేమిద్దరం ఒకే వ్యక్తిగా నిలిచిపోయాం.

వ్యక్తిగతంగా నాకు పేరు సంపాదించి పెట్టింది ఆకాశవాణి. ఆసంస్థకి కృతజ్ఞతలు చెప్పుకోడం నావిధి. వినయపూర్వకంగా చెప్పు కోవాలంటే, జానపద సంగీతశాఖకు, ప్రప్రధమ నిర్వాహకు రాలిగా, జానపద సంగీతానికే ఆకాశవాణిలో, ఓప్రత్యేక స్థానాన్ని సంపాదించి పెట్టకలిగానన్న ఆత్మ సంతృప్తి పొందకలిగాను, శ్రోతల అభిమానాన్ని అందుకో కలిగాను.

ఇలా ఉద్యోగ రీత్యా సేకరించిన పాటలు కోకొల్లలు వీటిలో కొన్ని పుస్తక రూపంలో పొందుపరచాలనే సదుద్దేశం కలిగింది.

కర్నాటక సంగీతంతో బి యే. అయాక, 'ఆంధ్రదేశపు జన పద సంగీతం'లో పరిశోధన చేసి, 1952లో ఎంలిట్ డిగ్రీని పొందాను. ఆ పరిశోధనా ఫలితమే, ఇటీవల వెలువడిన, నా ఇంగ్లీషు గ్రంధం 'Folk Music of Andhra Pradesh'. అది కేవలం, శాస్త్రీయ దృష్టితో, సంగీతపరంగా వ్రాసింది సంగీతజ్ఞులకే ఎక్కువగా అందుబాటులో వుండేది

కాని, ఇప్పుడు తలపెట్టిన ఈపాటల పుస్తకాలు, ఆబాలగోపా లానికీ అందుబాటులో వుండాలని నా సంకల్పం. దాదాపు ఈపాట లన్నీ ప్రతీరోజూ ఆకాశవాణి ప్రసారాల ద్వారా అందరికీ వినిపిస్తూ

న్నవే కనుక, స్వరాలతో వేయదలచుకోలేదు, అలావేస్తే, ఆ పరిధి విద్వాంసులకే పరిమితమవుతుంది. ఎవరైతే నాకీ పాటలు అందించారో, ఆ పల్లె ప్రజలు భద్రపరచుకోలేని పాటల్ని, వారికే తిరిగి పుస్తకాలుగా అందించి తరించాలనిపించింది నా మొదటి కానుక 'లాలి– తాళి'- జోల పాటలు, పెళ్లిపాటలు.

డా. బెజవాడ గోపాలరెడ్డిగారి ఆశీఃపూర్వక ప్రశంసలు, డా. సి నారాయణరెడ్డిగారి అభిమాన పూరితమైన అభినందన, పాలగుమ్మి విశ్వనాథంగారి సన్నిహిత పరిచయ వాక్యాలు, నాకెంతో ఉత్సాహాన్నీ ప్రోత్సాహాన్నీ కలిగించాయి వారికి నా హృదయ పూర్వక సుమాంజలులు

ఈ పుస్తకాన్ని ఆకర్షణీయంగా రూపొందించిన చిత్రకారుడు, మా మామయ్య దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కుమారుడు బుజ్జాయికి నా ఆశీస్సులు ఇంత చక్కగా ముద్రించిన శ్రీ సేవామందిర్ ప్రెస్ వారికి అభినందనలు.

ఆర్థిక సహాయాన్ని అందచేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి, నా ప్రత్యేకాభివందనాలు.

వింజమూరి సీతాదేవి



# నేను నేనే...!

''నేను ఎవరిని అని చాలమంది ప్రశ్నించుకొంటూ ఉంటారు. ఈ ప్రశ్నను గురించి మీరేమైనా ఆలోచించారా?'' అని డాక్టర్ రవీంద్రనాథ్ గారిని ఒకసారి ప్రశ్నించినప్పుడు, ''వేదాంతులు మాటాడుకునే ఆత్మ ఏమిటో నాకు తెలియదు కాని, నా మాత్రానికి నేను దానికి ఈ విధంగా సమాధానం చెప్పుకొంటాను'' అన్నారు ఆయన.

''నేను నేనే. నేనుకు అర్థం చెప్పుకోవడానికి నేను నానుంచి బయటికి పోవలసిన పనిలేదు. జీవితంలో అనేక సన్నివేశాలు ఎదురవుతూ ఉంటాయి. వాటిల్లో నా పాత్రను నేను నిర్వహిస్తూ ఉంటాను. మామూలుగా ఈ పాత్రల పరంగా నేను 'ఇది', 'ఎలాస' అని చెప్పుకొంటాం. కేవలం నేను తండ్రి, భర్త, స్నేహితుడు మొదలైన పాత్రల సంయోగం మాత్రమే కాదు. అంతకంటె ఎక్కువ. నాకు కొన్ని

# లాలి బంగరు బొమ్మ

లాలి బంగరు బొమ్మ లాలి మాయమ్మా!
లాలి ముద్దుల గుమ్మ లాలి సీతమ్మా! ॥లాలీ॥

చెలువుగా మిధిలాపురంబు చేపట్టి,
చెలగుచును జనకునకు సుతగాను పుట్టి ॥లాలీ॥

సీత యను పేరుతో ప్రఖ్యాతి బుట్టి,
సిరులు సొంపరయ రాముని చేయి బట్టి ॥లాలీ॥

పగడంపు రత్నాల డోలికను గట్టి
సొగసైన ముత్యాల జాలారు వేసి ॥లాలీ॥

రంగైన బంగారు గొలుసు లమరించి,
రంగుగా సీతాభి రాజ్ఞిని చేర్చి. ॥లాలీ॥

ఘల్లుమని మొలనూలు గంటలు మ్రోయ,
దండైన వంకీలు మెండుగా మెరయ ॥లాలీ॥

మెడనున్న హారములు మెలికలుగ జార,
పంకజాక్షులు తొట్టె పాడి యూచెదరు. ॥లాలీ॥

పడతులకు పచ్చల చాకట్లు జార,
పాపిటలు చెదరగ పయికొంగు తూల ॥లాలీ॥

పద్మముఖులు చెదర, పరమ కృప మీర,
లాలనుచు పూచెదరు రమణులు నిలచి. ॥లాలీ॥

జీవితాంతం మానవీయ ప్రవృత్తిని,
అవ్యాజమైత్రిని తన మనుగడలోని
అవిభాజ్య పార్శ్వాలుగా మలచుకొన్న
ఆలపాటి రవీంద్రనాథ్ రుచిరస్మృతి

# రుచిర స్మృతి

☆

డాక్టర్ సి. నారాయణరెడ్డి



కాళ్ల గజ్జలు గొనుచు కడియాలె గొనుచు,
కౌశల్య నాయనమ్మ వచ్చె నేడవకు!
పుట్టు టందెలు గొనుచు పులిగోళ్లె గొనుచు,
భూదేవి అమ్మమ్మ వచ్చె నేడవకు!
ఏడవకు కుశకుమార! ఏడవకు తండ్రీ!
ఏడుస్తే నిన్నెవ్వ రెత్తుకుందురు?
చేతి మురుగులు గొనుచు బాకట్లె గొనుచు,
శాంతమ్మ మేనత్త వచ్చె నేడవకు!
లక్షవేల గొడుగులు రంజిల్లు చుండ,
లక్ష్మన్న పినతండ్రి వచ్చె ఏడవకు!
సెనగపువ్వుల దుప్పటి, చేతిరుమాలు గొనుచు,
శత్రుఘ్నుడు పినతండ్రి వచ్చె నేడవకు!
కోటివేల గొడుగులు రంజిల్లు చుండ,
చిలుకలే గొనుచు,
రావిరేకులు గొనుచు,
రత్నాలు గొనుచు,
శ్రీరాము మీ తండ్రి వచ్చె నేడవకు!
అకులు పోకీలు హనుమంతు గొనుచు,
హనుమంతు మన బంటు వచ్చే నేడవకు!
అడవికి మీ తండ్రి నను విడువ నంపె,
మన కెవ్వరున్నారు మముగన్న తండ్రీ?
పైనున్న పక్షులు బంధువు లవి కొడుకా!
అవి మన బంధువులు మముగన్న తండ్రీ!

# చిచ్చో లాలి లాలి లాలో

చిచ్చోలాలి లాలిలాలో శ్రీరాముల లాలీ!
అయోధ్య బాలకులారా! అయ్యో ఏడవకు!

చెట్టూ చెట్టూ ఆకులు దిని, సెరువు నీళ్లు తాగి,
ఎన్నాళ్లు బ్రతుకుదు కొడుక? ఈ అడవిలోన?

ఆడజన్మ మెత్తితి కొడుక, అమిదాయె నాకు;
సీతనై జన్మించితి కొడుక, సిగ్గాయె నాకు!

ఏలు ఏలుకి వుంగరాలు, మెడ సందనాలు,
శ్రీరాములు మీ తండ్రి తెస్తా డేడవకు!

పుయ్య పసుపులు దెబ్బా, పువ్వులు దెబ్బా,
మీ అవ్వ కౌశల్య వస్తా దేడవకు!
ఊగ ఉయ్యాల దెబ్బా, ఉగ్గు గిన్నె దెబ్బా!
సీతాత జనకుడు వస్తా డేడవకు!

ఇక్కడ కలిగిన సంతులు కొడుకా!
నీకు అయోధ్యలో కలిగుంటే,
పది ఏళ్లనాటి పాత బియ్యం పచ్చానికి అమరు.

ఇక్కడ కలిగిన సంతులు కొడుకా!
నీకు అయోధ్యలో కలిగుంటే,
పది ఏళ్లనాడు పాత కరివేపాకు పచ్చానికి అమరు

# లాలి శ్రీ రఘురామ

లాలి శ్రీ రఘురామ,
లాలి గుణధామా!
లాలి నడిపూడి పుర
ధామ, శ్రీరామా! ॥లాలీ॥

శశి భాను గొలుసులతో,
సత్వజాలరుతో,
పొసగు మంచమున మేల్
కుసుమ ధామములే, ॥లాలీ॥

అసమాన భక్తితో,
కనుల వేడుకతో,
కసిదీర నూచ, వసి
యించు జానకితో! ॥లాలీ॥

# రామా లాలీ

రామా లాలీ, మేఘ శ్యామా, లాలీ!
తామరస నయనా! దశరధ తనయా! లాలీ!
రామా లాలీ ॥

అబ్జ వదనా, ఆటలాడి అలసి నావురా,
బొజ్జలో పాలరుగు దాక నిదుర పోవరా!
రామా లాలీ ॥

జోల పాడి జోకొట్టితే ఆలకించేవు,
చాలించి మరి వూరుకుంటే సంజ్ఞ చేసేవు!
రామా లాలీ ॥

అద్దాల తొట్టె లోను నీవు అమరి యున్నావు;
ముద్దు పాప డున్నా డంటే మురిసి చూసేవు!
రామా లాలీ ॥

ఎంతో ఎత్తు మరగినావు, ఏమిసేతురా?
బుంగ పట్టుకుని పెద్ద బూచి వచ్చేను!
రామా లాలీ ॥

# నిదుర పోడమ్మా మా రాముడు

నిదుర పోడమ్మా మారాముడు,
శ్రీరాముడు బెదరినా డమ్మా!
నిదుర పోడమ్మా!

నిదుర పోడమ్మా వా డలిగే కారణ మేమో?
నిదుర బుచ్చుదమన్న బెదరి బెదరి చూచు!
నిదుర పోడమ్మా!

కలలోనే ఆ పది తలలు వాడు వచ్చి,
నిలిచి యున్నాడేమొ పలువరించను సాగె!
నిదుర పోడమ్మా!

గట్టిగ మనము వశిష్టుని పిలిపించి,
దిష్టికి వీబూది పెట్టించిన గాని!
నిదుర పోడమ్మా!

# నిదుర పోడమ్మా !

నిదురా పోడమ్మా, మా రాముడు
బెదరినాడేమో ?

లోలాక్షి కమలాక్షి పసిబాలులతో కలిసి,
ఆటలాడి నపుడు బెదరి నాడేమో, మారామయ్య ?
నిదుర పోడమ్మ

వీధూ వీధులు తిరిగి, సాధుల పిలిపించి,
సాధుల పిలిపించి, రక్షరేకు కట్టిన గాని;
నిదుర పోడమ్మ !

పసుపునీరు సున్నం పైబార దిగదుడిచి,
దిగదుడిచి గుంట్లా పోసినగాని;
నిదుర పోడమ్మ

పాలు ఇంగువ సున్నం కలిపి దిగదుడిచిన, గాని
దిగదుడిచి పచ్చనసెట్టు కింద పారబోసిన గాని ;
నిదుర పోడమ్మ !!

భూమి లెంబడి తిరిగి, భూతవైద్యుని పిలిచి,
రాగి రక్షరేకు చేత కట్టిన గాని ;
నిదుర పోడమ్మ !

# నిదుర పోడు కృష్ణుడు

నిదుర పోడు కృష్ణుడు బెదరినాడు,
అయ్యో వీడు నేడు బెదరినాడు!
కుదురుగా ముజ్జగములు, జో
కొట్టి నిదుర బుచ్చిన గాని; నిదుర పోడు!

గట్టిగ విభూది నుదుట
పెట్టిజూచి, సంధ్యవేళ
గుట్టుగాను గొప్పదిష్టి
తీసి వేసిన గాని; నిదుర పోడు!

తంత్రమున నేడు మహా
మంత్ర వాదులచే నాభి
మంత్రింపించి, మొలకొక్క
యంత్రము గట్టిన గాని, నిదుర పోడు!

బాలరో! సుదర్శనము
కేల రాదు కృష్ణునికి,
బాల గ్రహ దోష శాంతి
చాలగ తీసిన గాని, నిదుర పోడు!

# అప్పా రావోయీ

అప్పా రావోయీ, ఒప్పుల కుప్పా రావోయీ !
తప్పటడుగూ లిడుచును మా  అప్పా రావోయీ !

అంగీ లోపల నీ బొజ్జ ఆకలి గొన్నాది,
బంగారు నాతండ్రీ ! నీకు పాలు పోసేను ! అప్పా రావోయీ!

రంగుగ నేనెంత పిలిచినరాక గునిసేవు ;
బుంగ పట్టుకుని పెద్ద బూచి వచ్చేను ! అప్పా రావోయీ!

లాల పోసుకో, బాబయ్యా ! చాల ప్రొద్దాయె ;
తాలిమితో నీ కావెనుక వెన్న వుంచేను ! అప్పా రావోయీ!

పాలూ బువ్వా తిని తొట్టెలో పవ్వళించితే,
లాలి పాటలతో నిన్ను జోలపాడేను ! అప్పా రావోయీ!

నరిపేదు కట్టి నిన్ను ముస్తాబు చేసేను,
అరుదుగ నీ చదురులోకి ఆడుకో బొమ్మా! అప్పా రావోయీ!

ఉరువైన నీ సొగసు చూచి ఉత్సకించేరు,
తిరుగ బోకుమీ స్వారీలో, దృష్టి తాకేను! అప్పా రావోయీ!

# ఆ తొట్టి యీా తొట్టి

ఆ తొట్టి యీా తొట్టి అక్షరంబుల తొట్టి,
ప్రారంభ మాయెనే ఉయ్యాలో!
రక్షకుడు క్రిష్ణయ్య తొట్టె లోపల, తా
నూగుతు నున్నడే ఉయ్యాలో!

పన్నెండు స్తంభాల ఆ పర్ణ శాలల్ల,
ఆ తొట్లో లేసిరె ఉయ్యాలో!
రక్షకుడు కృష్ణయ్య తొట్టె లోపల, తా
నూగుతు నున్నడే ఉయ్యాలో!

పన్నెండు బార్లది మంచపు నులక,
మనసుతో నల్లెనే ఉయ్యాలో!
రక్షకుడు కృష్ణయ్య తొట్టె లోపల, తా
నూగుతు నున్నడే ఉయ్యాలో!

పంచ కన్నెలు కూడి,
పంచ వేదము చదివి,
ఆ తొట్టె ఊపిరే ఉయ్యాలో!
రక్షకుడు కృష్ణయ తొట్టె లోపల, తా
నూగుతు నున్నడే ఉయ్యాలో!

# జో జో జో లాలా

జో జో జో జో లాలా!
జోజోజో నంద బాలా!

నా నవనీత చోరా!
నా నంద గోపాలా!
నా యశోద బాలా!
నా వేణు గోపాలా! ॥జో జో జో॥

నా చిన్నారి తండ్రీ!
నీ ముద్దు లివ్వరా!
నా కన్నారి తండ్రీ!
నీ నవ్వూ లేవిరా? ॥జో జో జో॥

తలుపు లేసినారు
తనవా రెవ్వరేమి?
వేసీమూసీనార
చిన్నికృష్ణుడమ్మా! ॥జో జో జో॥

గొల్లా వీధినుండి
వెన్నా దొంగ లేమి?
పొన్నా చెట్టు నున్న
చిన్నీ కృష్ణు డమ్మా! ॥జో జో జో॥

# కస్తూరి రంగ లాలీ

కస్తూరి రంగ లాలీ! శ్రీహరీ!
కావేటి రంగ లాలీ!

సద్గురుడు అవతార మెత్తినపుడు,
ఏడుగురు దాదులను సంహరించి నపుడు; ॥కస్తూరి॥

నిద్దట్లో ఆ బాలుడు కేరుకేరని ఏడ్వగా,
అమ్మ యశోద లలనాక్షీ! నన్నెత్తు కోవమ్మా!
నిన్నెత్తు కుందునే గోపాల, నిముషమ్ము తాళు తండ్రీ!
॥కస్తూరి॥

తడి వస్త్ర మిడిసి నాది యశోద, పొడి వస్త్రం గటినాది,
బాలుణ్ణి యెత్తుకోని యశోద, సక్కదనము చూసేను!
నిన్నెత్తుకోని గోపాల, ఏతావు బోదురా, కన్నతండ్రీ?
॥ కస్తూరి ॥

ఏ బూచివా డొచ్చేనో పవళించు కన్నతండ్రీ!
ఏ జోగివా డొచ్చేనో పవళించు కన్నతండ్రీ!
జో గేమి చేసునమ్మా? జోగి మందులు తంతులు,
ఎప్పటికి నా జేబులో నుండు నమ్మా! ॥ కస్తూరి ॥

ఈపున ఇంద్రమణి, గోపాల, అరిసేత వైకుంఠము,
చికురన చింతామణి, గోపాల, నాలికన నక్షత్రము,
బొడ్డున పారిజాతం, గోపాల, ఈపున ఇంద్రమణి! ॥కస్తూరి॥

# లాలి శ్రీ కృష్ణయ్యా

లాలి శ్రీ కృష్ణయ్యా!
నీల మేఘ వర్ణా!
బాల గోపాల, కృష్ణ,
బాలు, నిదుర పోవయ్యా! ॥లాలి॥

శృంగారముగ నిన్ను
బంగారు తొట్టెలో
రంగుగ నుంచి నే
జోలపాట పాడెదను! ॥లాలి॥

ఇందరి లోపల నీకు
ఎవరు కావలె నయ్యా?
ఇందీవరాక్షి కా
ళింది యే కావలెనా? ॥లాలి॥

లలితాంగి రుక్మిణీ
లలనయే కావలెనా?
పలుకు కోకిల సత్య
భామయే కావలెనా? ॥లాలి॥

# జో జో నందా

జో జో నందా జోపాల నందా
రాజగోపాలా ! నంద గోపాలా ! ॥జో జో జోజో॥

ఆకిట్ల పాపమ్మ వాట లాడంగ
గన్నేరు పువ్వొచ్చి కిన్నెర పాడూ ! ,,

వుంగరాల మీన రంగూలు వేసే,
రంగైన భద్రాద్రి రాము డేలంగ ! ,,

వాసాల సందునీ మీసాల ఎలకా,
పాప సేతిలో గిరికె పారేయె ఎలకా ! ,,

ఊకో పాపమ్మ ఊకోవమ్మా !
ఊకోమని యమ్మ ఊరు తిరిగొచ్చా ! ,,

పాటల్లు పాడంగ పల్లెలు తిరుగా,
వదము పాడామని పల్లె తిరిగొచ్చా ! ,,

కాకమ్మ పిచికమ్మ కతలు సెప్పేను,
పట్టు మెత్తల లోన పండుకో వమ్మా ! ,,

# చెట్టు చెట్టూ తిరిగి

చెట్టు చెట్టూ తిరిగి, చామంతీ పూదెచ్చి
చేతి కిచ్చినగాని, నిదుర బోడమ్మో!
శ్రీకృష్ణుడు బెదరి నా డేమొ! ॥నిదుర॥

భూము భూములు తిరిగి, భూతవైద్యుల దెచ్చి,
బుజముబుజము పట్టి బులువారించిన గాని, ,,

రాజ్య రాజ్యము తిరిగి, రస వజ్ఞుల దెచ్చి,
సాన మీద గంధము నూరి పోసిన గాని, ,,

వేన్నీళ్లు సన్నీళ్లు ఏకంగ పడదించి,
జారాడు బండ మీద జలకా మాడినగాని, ,,

కళ్లా కాటుకపెట్టీ, కస్తూరి బొట్టు వెట్టీ,
నల్లన్ని మేనంత సాంబ్రాణేసిన గాని, ,,

పట్టు బట్టలు చింపి, పొత్తిళ్ల తా బరసి,
పొత్తిట్లో బాలుణ్ణి పవ్వాళించిన గాని, ,,

ఎండీది ఉయ్యాల, పగిడీవి సేరుల్లు,
పగిడి సేర్లా పట్టి పాట పాడిన గాని, ,,

బంగారి వన్నెల పావీరము చేయించి,
బాలా సేతి కిచ్చిన గాని, ,,

# నిదుర పోవయ్యా

నిదుర పోవయ్యా, జోకొట్టద గాని!
నాగుంబాముల రెండు నడి కట్లూ కట్టుక,
నాటక మాడేటి నాయినా! కృష్ణా! నిదుర పోవయ్యా!

నాటక మాడేటి నాయినా! కృష్ణా!
జీడి పలుకులు నీకు తెచ్చి పెట్టద గాని,
జిద్దు సేతలు మాను, నాయినా! కృష్ణా! ॥నిదుర॥

సార పలుకులు నీకు తెచ్చి పెట్టద గాని,
సరసాలు మానుర, నాయినా! కృష్ణా! ॥నిదుర॥

మ్రొరి పలుకులు నీకు తెచ్చి పెట్టద గాని,
మోటు సేతలు మాను, నాయినా! కృష్ణా! ॥నిదుర॥

కోమ టోళ్ల వాడల్ల కోలాలు వేయంగ,
ఆట లాడి నావంట, నాయినా! కృష్ణా! ॥నిదుర॥

బాప నోళ్ల వాడల్ల బతుకమ్మ లాడంగ,
పాట పాడి నావంట, నాయినా! కృష్ణా! ॥నిదుర॥

# లాలించు కృష్ణయ్యా

లాలించు కృష్ణయ్యా!
నీల మేఘము చాయ,
నీల మేఘుని చాయ,
నిద్రబో కృష్ణయ్యా! లాలించు కృష్ణయ్యా!

సుందరమైన వనములో
బంగారు భవనములో
పాల మీగడ మీద
పవళించు కృష్ణయ్యా! లాలించు కృష్ణయ్యా!

రాలిన పూవ్వులన్నీ
రాసులాయ్యె కృష్ణయ్యా!
పోసిన పువ్వులన్నీ
దండలు గుప్పు కృష్ణయ్యా! లాలించు కృష్ణయ్యా!

ఇందా రందరిలోను
ఎవ్వరు కావలెను?
రూపులకు చక్కని
రుక్మిణిదేవి కావలెనా? లాలించు కృష్ణయ్యా!

# లాలనుచు పాడరమ్మా

లాలనుచు పాడ రమ్మా; ఈబిడ్డ
లక్ష్మి విలాసు డమ్మా!
శ్యామలా రూపు డమ్మా, ఈ బిడ్డ
లీలావతారు డమ్మా! ॥లాలి॥

కరమున కంకణంబు, ఈబిడ్డ
శిరమున పింఛ మమ్మా!
ఉరమున శ్రీవత్సము, ఈబిడ్డ
హరి యనుచు పాడ రమ్మా! ॥లాలి॥

పాదమున చక్ర మమ్మా, ఈబిడ్డ
వేదాంత వేద్యు డమ్మా!
వేణు నాదంబు తోడ ఈబిడ్డ,
వేదములు పాడునమ్మా! ॥లాలి॥

# లాలి జగన్మోహనాకారా

లాలి జగన్మోహనాకారా! లాలీ!
జగదేకవీరా! లాలి, శుభాకారా! లాలీ! ॥లాలి॥

పాల వారధి చేరి పవ్వళించితివి,
భుజగశయ నుండవై భూమి నేలితివి!
కాళీయఫణి ఫణాగ్రముల ద్రొక్కితివి,
కంసుణ్ణి సంహరించుటకు పుట్టితివి! ॥లాలి॥

మత్స్యమై జలధిలో పుట్టి చొచ్చితివి,
సోమకుని కూల్చితివి క్షామంబులేక,
కూర్చి వేగమె దెచ్చి బ్రహ్మ కిచ్చితివి,
బ్రహ్మచే మెప్పొందితివి, రామకృష్ణా! ॥లాలి॥

కూర్మమై కుదురుగా కొండ నిల్పితివి,
భుజగ మొక్కటి దీసి, తాడుగాజేసి,
అట్టి పర్వతము కవ్వముగా బట్టి,
అమృతమ్ము తీయించె అమరులచే కృష్ణా!
॥లాలి॥

హేమకశ్యపు దూషణము తాజేయ,
ప్రహ్లాదు డట్టె తా నమ్ముకొన్ని యుండ,
కశ్యపుని కూల్చుటకు అవతారమెత్తి,
ఉక్కు స్తంభంబు నందు, ఉద్భవించితివి!

॥లాలి॥

రఘు వంశమునను రాముండవై బుట్టి,
రామలక్ష్మని బ్రోచుననుచు బల్కితివి,
దశరథ మహారాజు తండ్రిగా పడసితివి,
దశదిశలు వెలుగంగ తేజరిల్లితివి!

॥లాలి॥

# లాలి ముద్దుల హంస

లాలి ముద్దుల హంస, లాలి పరమాత్మా!
లాలి ముక్తికాంత, లాలి శ్రీకాంతా! ॥లాలి॥

ముగ్గురు మూర్తులూ ముందుగా నిలిచి,
బాగుగా నూచెదరు, పాడి, పూజించి! ॥లాలి॥

మక్కువతో నూచేరు, మగువ నీ తొట్టి,
పసిడి గొలుసులను ప్రేమతో బట్టి! ॥లాలి॥

సూటిగ రత్నాల మేడ లోపలను,
నీటుగ పవళించి నిదుర పోవగను! ॥లాలి॥

కమలాక్షి ముఖము సోముని గేలిసేయు,
కులుకు పలుకులు చిల్క పల్కులను గెలియ!

॥లాలి॥

ఏడు కొండల మీద నరుదు గా నీవు
మెరయు చుందువు, మేటి పరము లోపలను!

॥లాలి॥

సర్వ కాలము లందు సాక్షిగా నిలచి,
శేషాచల యోగి సేవగావించి! ॥లాలి॥

# లాలి శ్రీ వరగిరీశ

లాలి శ్రీ వరగిరీశ ! పరమేశ ! లాలి విశ్వప్రకాశ!
లాలి బాలామణీశ ! సఖిలేశ ! లాలి పీఠాపురీశ !

॥లాలీ॥

బాగైన సౌధమునను, రత్నంపు తూగుటుయ్యాల లోద,
రాగములు పాడి నిన్ను, నిదురించ ఊచెదను, ఉయ్యాల!

॥లాలీ॥

అంగీకరముగ వెలసీ, మా సర్వమంగళాదెవి యనసీ,
సంగీతములను దినిసీ, నిదురించు మంగ జావద్ద గెలచీ !

॥లాలీ॥

నవరత్న ఖచితమైన హేమంపు నవ్య సింహాసనమున,
దివిజు లందరు గొలిచిన వరము లిడు, భవ శీతాద్రిభవనా!

॥లాలీ॥

# జో లాలి లాలి

జో లాలీ లాలి లాలమ్మ లాలి
లాలమ్మ లాలి!

నూతుల్లో నువు బుట్టి,
నూతుల్లో నువు బెరిగె !

జోలాలి, నీ మూతెంత చక్కనే, నాయమ్మ జలగ!
జోలాలి, నీ కాలెంత చక్కనే, నాయమ్మ జలగ!
కాలవల్లో నువు బుట్టి,
కాలవల్లో నువు బెరిగె! జోలాలీ!

జోలాలీ - నా పిరాపురం రాజుగారు పీట లంపేరా ?
,, - నా పీటన్న యేసుకో నాయమ్మ జలగ!
,, - నా కాకినాడ రాజుగారు కారు లంపేరా?
,, - నా కారు మీద కూకోయే నాయమ్మ జలగ!
,, - నా కారు పోను నా కేమి సోకు?
,, - నా వోయి నా వన్నాలా! మా వన్నీ లా లా!
,, - నా రాజమండ్రి రాజు గారు రైక లంపేరా?
,, - నా రైకన్న తొడిక్కోవే, నాయమ్మ జలగ !
,, - నా కాకినాడ రాజుగారు కాసు లంపేరు!
,, - నా కాసులన్న యేసుకోయె, నాయమ్మ, జలగ!

# జోజో లాలి జో లాలి

జో జో లాలి జో లాలి
శివ శంకర పావన నాగవర్నా !

అందరి మామల్లు
రామసిలుకల్లు ;
మా అయ్య మామల్లు
చందమామల్లు !

జోజో లాలి జో లాలి

నాగాసెల మట్టితే
నాగన్న నిద్రోయె ;
జో అని పాడితే
మా బాబు నిద్రోయె !

జోజో లాలి జో లాలి

# ఏమే ఓ చిట్టీ

ఏమే ఓ చిట్టీ! ఏడవకే ఈ రొట్టీ,
ముక్కావిరిచి పెట్టి, నిను పాడుతు జో కొట్టీ! ॥ఏమే॥

అదుగో బూచాడు, మన అటక మీదున్నాడు,
ఏడుస్తే నినువాడు ఎత్తూకు పోతాడే! ॥ఏమే॥

నోరు తెరచుతాడు, బల్ కోరలు చూపుతాడు,
నీ అరడి విన్నాడు, ఈ సారి ఊరుకోడు! ॥ఏమే॥

మిట్లగుడ్లవాడు, పొణ కంత పొట్టవాడు,
మన తట్టలో దాగున్నాడు, జడ పట్టుకు లాగుతాడే! ॥ఏమే॥

బెల్లము పెట్టుతాను, నీ అల్లరి ఇకమాను,
ఇల్లా అల్లరి చేస్తే, వాళ్ల పిల్లకు పెట్టేస్తాను! ॥ఏమే॥

ఉయ్యాల లూపిస్తాను, బట్ల పెయ్యని చూపిస్తాను,
నెయ్యీ బువ్వా తిను, తాత య్యెత్తు కొనునే! ॥ఏమే॥

అల్లరి శాయకమ్మ, బులి కంటే లివిగో నమ్మా!
మా తల్లీ నీకే నమ్మ, పెద పిల్లీ కివ్వ నమ్మా! ॥ఏమే॥

# రావె రావె చిలుక

రావె రావే చిలుక, రత్నాల చిలుక,
రావేమె చిలుక, ఓ రామ చిలుక ?
తోటలకు నీవేగి తెచ్చిన పండు,
వాడలకు నీవేగి తెచ్చిన పండు,
పల్లెలకు నీవేగి తెచ్చిన పండు,
మ చిన్ని అమ్మాయి చేతి కందిమ్మ ! ॥లాలీ॥

ఏడవకు ఏడవకు వెఱ్ఱి అమ్మాయి !
ఏడిస్తే నీ కండ్లు నీలాలు గారు ;
నీలాలు కారితే నే చూడ లేను,
పాలైన కారవే, బంగారు కనులు !
నిద్రపో అమ్మాయి, నిద్రపో తల్లీ ! ॥లాలీ॥

ఇంద్ర కన్యక లొచ్చి నిన్ను లేపేరు ;
భద్ర కన్యక లొచ్చి పాట పాడేరు ;
నాగ కన్యక లొచ్చి నాట్య మడేరు ;
దేవ కన్యక లొచ్చి వీణ మీటేరు ;
నిద్రపో అమ్మయి, నిద్రపో తల్లీ ! ॥లాలీ॥

# నిద్రపో అమ్మాయి

నిద్రపో అమ్మాయి, నిద్ర పోవమ్మా !
నిద్రకూ వెయ్యేళ్లు, నీకు వెయ్యేళ్లు !
నిను గన్న తల్లులకు నిండ వెయ్యేళ్లు !
నిద్రపో అమ్మాయి, నిద్రపోవమ్మా ! ॥లాలి॥

లాలి లాలి లాలి లాలిలో !
అమ్మాయి రాణి లా గుంది,
లాలెమ్మ గుత్తాలు లంకెల్ల మేసు,
అమ్మాయి గుత్తాలు పల్లాలు మేసు ! ॥లాలి॥

చిన్న నా అమ్మాయి చీర కేడిస్తే !
నెయ్యా వోయి సాలీడ, నేత్రాన పట్టు !
మురుస్తూ సాలీడు మూడు నెలలు నేసె;
వేడుకతొ అమ్మాయి వెయ్యేళ్లు గట్టె ! ॥లాలి॥

ఊరి ముందర చింత, ఉగ్రంపు చింత,
అ చింత పూచితే, మరి చింత లేదు !
మా రాజు అబ్బాయిని చే బట్టి తేను,
మా రాణి అమ్మాయికి మరి చింత లేదు! ॥లాలి॥

# లాలీ లాలమ్మ లాలీ

లాలీ లాలమ్మ లాలీ!
    లాలమ్మా లాలీ! లాలమ్మా లాలీ!

లాలమ్మ గుఱ్ఱాలూ
    లంకల్లో మేసె, లంకల్లో మేసె! ॥లాలీ॥

బుల్లెమ్మ గుఱ్ఱాలూ
    బీడుల్లో మేసె, బీడుల్లో మేసె!

అప్పన్న గుఱ్ఱాలూ
    అడవుల్లోమేసె, అడవుల్లోమేసె! ॥లాలీ॥

ఊరుకో అబ్బాయీ,

వెఱ్ఱి అబ్బాయీ!

ఉగ్గెట్టూ మీయమ్మ
    ఊరూ కెళ్లింది, ఊరూ కెళ్లింది! ॥లాలీ॥

పాలిచ్చూ మీయమ్మ,
    పట్నా మెళ్లిందీ, పట్నా మెళ్లింది!

నీ లోసే మీయమ్మ,
    నీళ్లా కెళ్ళింది, నీళ్లా కెళ్ళింది! ॥లాలీ॥

# ఓ జోలా

ఓ జోలా !
జోల మామిడి పళ్లు దూరాని గలవు,
దాని గట్టి తెచ్చేరె, అమ్మాయి మామల్లు !

||ఓజోలా||

అమ్మాయి మామల్లు యెటువంటి వారు ?
చేప గంపల దగ్గిర చెయి జాచువారు !

||ఓజోలా||

పంది పిల్లానెక్కి పరుగెత్తు వారు !
వారు మా అమ్మాయి మేన మామల్లు!

||ఓజోలా||

అమ్మాయి బాబయిలు యెటువంటి వారు?
చెవి చెవిని చేరడేసి పోగుల్ల వారు !

||ఓజోలా||

అంచు పంచల వారు, అంగీల వారు,
పట్టు పంచల వారు, పాగాల వారు !

||ఓజోలా||

గుండు పోగుల వారు, గుఱ్ఱాల వారు ;
వారు మా అమ్మయి బాబాయిలు !

||ఓజోలా||

# ఒల్బొల్బొ ఆయమ్మ

ఒల్బొ ల్బొ ల్బొ ల్బే ల్బే -- ఆయమ్మ ఆయమ్మ !

ఊడిద చెట్లాకు ఉయ్యాల కట్టి,
ఊప మని మీ అమ్మ ఊరు తిరిగొచ్చ్యా!

పాలాకు ఏసేవు పట్టేడ గిన్నె,
పారి పో ఎల్లమ్మ పారిపో వమ్మా !

బుజ్జమ్మ మామల్లు పొలమెల్ల తోలింద్రు,
జోలల్లు పాడంగ జొన్నల్లు పండు !

తత్త పుత్తడి బొమ్మ తల నిండ జడలు,
తాతల్ల సంకాన ఆడు లచ్చమ్మ !

పల్లేరుగాయల్లు పసుపుల్లు పరచి,
పండమని మీ యమ్మ పల్లె తిరిగొచ్చు!

# జోజో ముద్దుల బాల

జో జో ముద్దుల బాల,
జో జో పరమ సుశీల,
  జో జో కోమల గాత్రీ,
  జో జో భారత పుత్రీ! జోజో

పాలు త్రాగు నపుడే నీకు
పాడ వలయు సీతా చరితము;
  భూమి మీద అడు గిడు నపుడే,
  భూరి విద్యలు నేరువ వలయు! జోజో

దంతపు టుయ్యాల లోన,
ధగ ధగ టుయ్యాల లోన,
  చింతలేక నిదుర పోవ
  ఇంత అగడ మేలనె బాలా? జోజో

# ఉగ్గు తాగిన బాలయ్యో

ఉగ్గు తాగిన బాలయ్యో!
ఊసులాడు తాడయ్యో!

-లాలీ లాలీ-

పాలు తాగిన బాలుడు, పాక వీడొచ్చింది!
ఉగ్గు పాలూ తాగీ, మాటలాడు తాడమ్మా!

-లాలీ లాలీ-

తల్లన్న మాటలూ! తానాల కించేడు
తల్లన్న పాటలూ! తానాల కించేడు,

-లాలీ లాలీ-

తల్లన్న మాటలూ ప్రేమతో విన్నాడు
తల్లన్న పాటలూ తనువుతో విన్నాడు

-లాలీ లాలీ-

నక్కనీ బాలుడు నిద్దరోతున్నా డమ్మా!
కుసుమ పొత్తుల మీద పండుకున్నా డమ్మా!

-లాలీ లాలీ-

# లాలి లాలి లాలి

లాలి లాలి లాలి లాలమ్మ లాలీ!
లాలనుచు పాడరే, ఓ బాల తండ్రీ
నా బాల తండ్రీ!

ఏడవకు నా తండ్రి, ఎర్రి నా తండ్రీ!
ఏడిత్తే నీ కళ్లు నీరు కారేనూ,
నీళ్లు కారిన కళ్లు పాలు కారేనూ॥

నిద్దరో నా తండ్రి, నిద్ధరో తనయుడా!
నిద్దరికి నూరేళ్లు, నీకు నూరేళ్లూ!
నినుకన్న తల్లి కయ్యో, నిండా నూరేళ్లూ!

నిదరో బాలుడయ్యో, నిద్దరోవయ్యా!
రవ్వ చేయక తండ్రి, నిద్దరోవయ్యా!
రవ్వ జేసితేని, రాజూ లింటారు ॥

గోల చేయకయ్యో, నా తండ్రీ!
అల్లిరి చేయకయ్యో, నా తండ్రీ!
అల్లరి చేసితేని అవి తప్పు లౌస్తాయి!

గోల జేయకయ్య, ఊరంద రింటారు!
ఊరంద రింటారు, జగమెల్ల ఇంటారు;
జగమెల్ల మెచ్చునా, లోకమెల్ల మెచ్చునయ్య!
నిద్దరో నా తండ్రి, నిద్దరోవయ్యా!

# ఏడవక బజ్జోర

ఆయీ ఆయీ ఆయీ!
ఏడవక బజ్జోర, వెర్రి నా బాబు!
ఏడిత్తే నిన్నెవరు యెత్తుకున్నేరు?

బజ్జోర బాబు

జోల పాటలు పాడ బాలలకు నిదర,
నాగ సరమూ పట్ట నాగులకు నిదర!

బజ్జోర బాబు

మేనత్త రాదప్ప, మేలిమి బంగారు
మొలతాడు తెత్తాది; బజ్జోర బాబు!

బజ్జోర రాబు

గద్ది లెక్కేడు బుద్ది నీ కొద్దు కొడుక;
గద్ది లెక్కిన గుణము గంగ పాలవునుర!

బజ్జోర బాబు

సంత కెల్లిన మామ చప్పు నొచ్చేత్తాడు,
వచ్చి నీ కిత్తాడు చిప్పల మొలతాడు!

బజ్జోర బాబు

బెదురు చూపులు మాని నిదుర పోరా బాబు!
యింటిలో పనులన్ని అలాగె వున్నాయి!

బజ్జోర బాబు

# జోలలకు జొన్న బువ్వ

జోలలకు జొన్న బువ్వ, అమ్మ కోరి బువ్వ;
యేడ్చేటి అమ్మాయికి యెత్తావు పాలు!
చిన్ని నా అమ్మాయి పుట్టిన్ని నాడు,
స్వాతి వానలు గురిసె, సముద్రాల కడను;
పాల వానలు కురిసె, బంధువుల కళ్లా.

తాటి కొండ రత్నాలు రెండు నేత్రాలు,
చీకటికి దీపాలు, చిట్టి తల్లి కళ్లు!
ఎవ్వ రేమన్నారు, నిన్ను నా తల్లి?
వెలలే[illegible] సిఖరో, ఏను [illegible]న్నా[illegible]రా?
కలభాని కట్టి[illegible], [illegible]సక [illegible]న్నారా?

నా చిన్ని అమ్మాయి, నా చిన్ని మోము,
నిండు పున్నమ నాటి, చంద్రుణ్ణి పోలు!
చిన్ని నా అమ్మాయి చిరు మోము జూచి,
సిగ్గు పడి చంద్రుడు, పొడవ జాలడు.
మర్నాడు అమ్మాయి మాటల్లు విని,
మాణిక్యాల తోను పొడిచె, చంద్రుడు!

# జోల పాడిన వారు

జోల బాడిన వారు
జోకొట్టు వారు
అబ్బాయిని బాడిన వారు
ముద్దాడు వారు
తాతలకి ముద్దమ్మ
తండ్రులకు ముద్దు
అంతకన్నా ముద్దు
మేనమామలకి
మేనమామలగారి
పట్టె నిమ్మనీ
ఎక్కడె బాబయ్య
వెలపొన్న మాను
మంచి గంధపుచెక్క
మామ లట్లాడ
మాపట్టె నిచ్చేము
దిగవయ్య పొన్నా॥

# జోలలు పాడితే

జోలలు బాడితే బాలలకు నిద్ర,
నాగస్వరము బట్టితే నాగులకు నిద్రి ;
ఆడంగ ముద్దమ్మ, పాడంగ ముద్దు,
అందరికి అమ్మాయి అల్లారు ముద్దు !
తాతలకి ముద్దమ్మ, తండ్రులకు ముద్దు ;
అంతకన్నా ముద్దు, మేనమామలకు ;
చిట్టి చిట్టి చిట్టి చీ మల్ల మఱ్ఱి ;
మఱ్ఱి కిందున్నాడు తొఱ్ఱినాగన్న,
తొఱ్ఱి నాగన్నకి తో డెవ్వ రమ్మా ?
ఏనుగుల్ని గాసేటి యెఱ్ఱడే తోడు,
గుఱ్ఱాల్ని గాసేటి గురవడే తోడు !



# పెళ్లి పాటలు

మానవ జీవితం ఎన్నో అనుబంధాలకూ బంధాలకూ లోనైన ఒక మహానాటకం, మానవుడు కళ్లు తెరచినది మొదలు కళ్లుమూసేవరకూ ఉండే జీవిత ఘట్టాలన్నీ ఈనాటకంలో రంగాలు.

ఈ ఘట్టాలన్నిటి లోనూ రసవత్తరమైనదీ, పవిత్రమైనదీ, పెళ్లి, సాంఘికంగా మహత్తరమైనదీ, వైదిక కర్మల్లో అత్యుత్తమమైనదీ, పెళ్లి, రెండు నిండు హృదయాల కలయిక, రెండు పవిత్ర ప్రణయానురాగాల అల్లిక పెళ్లి. కనులకూ వీనులకూ విందు వధూవరుల పొందు – పెళ్లి.

స్త్రీలకు ఎన్నో పండుగలూ వ్రతాలూ ఉన్నా, వాళ్లకి పెద్ద పండుగ, నవరస భరితమైనవినోద కార్యక్రమమూ, పెళ్లే, చూపులూ, నిశ్చితార్థమూ మొదలు మంగళసూత్ర ధారణ, అప్పగింతల వరకూ, పెళ్లి ఒక రోజైనా అయిదు రోజులయినా, అడుగడుగునా అన్నీ వినోదాలే ఈవినోదా లన్నీ, ఎన్నో పాటలతో పెనవేసుకుని ఉన్నాయి, పెళ్లాడే వధూవరులకే కాక, పెళ్లివారికీ, బంధుమిత్ర సపరివారానికీ కూడా, ఈపాటలు ఉద్రేకం, ఉత్సాహం, ఉత్తేజం కలిగిస్తాయి ఈ పాటల్లో, శృంగారం, హస్యం, కరుణ, ప్రధాన రసాలు

# పెళ్లి భేరాలు

అల్లవూరీ వారు పిల్ల నడిగేరు
పిల్ల వానికి రూపురేఖ లున్నాయి ॥
ఏటేట పండేటి భూము లున్నాయి,
ఊరి పొలి మేరిలో తోట లున్నాయి ॥

చుట్టు కొల్లారంపు మిద్దె లున్నాయి,
కుర్రవానికి వంచి సేద్య మున్నాది ॥

పిల్లవానికి తగిన ఈడు జోడేను,
కన్నె నిస్తామని కబురంపువాము ॥

అల్ల వూరీ వారు పిల్ల నడిగేరు,
యిల్లలికి ముగ్గెట్టి పెళ్లి సేతాము,
అల్లవూరీవారు పిల్ల నడిగేరు,
పిల్లవానికి రూపురేఖ లున్నాయి ॥

# పెళ్లి బేరాలు

చెల్లి  ఆరు నూరామడ నుంచి అన్నయ్యా
    పెళ్లని ఆశించు కొస్తి; అన్నయ్యా!
    అన్నయ్యా! బలరామ! అభిమన్యుడికి నేను
    పిల్లని అడుగ వస్తి అన్నయ్యా - నేను
    కన్యని అడుగ వస్తి అన్నయ్యా!

అన్న  కన్య నిచ్చే మాట కల్లోనె లేదు చెల్లి!
    కన్య నివ్వ నమ్మ చెల్లెలా! నేను
    పిల్ల నివ్వ నమ్మ చెల్లెలా!
    ఏడుకి ఎద్దు, అదిగో పాడికి బఱ్ఱె అదిగో!
    తోలుక వెళ్లమ్మ చెల్లెలా!

చెల్లి  ఏడుకి ఎద్దు వద్దు, పాడికి బఱ్ఱె వద్దు;
    కన్య నడుగ వస్తి అన్నయ్యా!

అన్న  దండాన సీర లున్నాయి, పెట్టెల్లో సీర లున్నాయి,
    కట్టుక వెళ్లమ్మ సెల్లెలా! పెట్టుక వెళ్లమ్మ సెల్లెలా!

చెల్లి  దండాన సీర లొద్దు, పెట్టెల్లో సీర లొద్దు,
    కన్య నడుగ వస్తి అన్నయ్యా!
    శశిరేఖ నడుగ వస్తి, రన్నయ్యా!

అన్న  శశిరేఖ నిచ్చే మాట చెవులను వినవే చెల్లి,
శశిరేఖ నివ్వ నమ్మ సెల్లెలా!
కుంకుమ భరిణ లవిగో! కాటిక కాయ లవిగో!
పట్టుకు వెళ్లమ్మ సెల్లెలా! తీసుకువెళ్లమ్మ సెల్లెలా!

చెల్లి  కుంకుమ భరిణ లొద్దు, కాటిక కాయ లొద్దు,
కన్య నడుగ వస్తి అన్నయ్య!
శశిరేఖ నడుగ వస్తి రన్నయ్య!

అన్న  నీ యిళ్ల మగవారు ముచ్చల వారైతె,
పిల్ల నేలా గిచ్చేదనె సెల్లెలా?
నేడు కన్య నేలా గిస్తును సెల్లెలా?

చెల్లె  మా యిళ్ల మగవారు ముచ్చల వారైతె,
నన్నేలా గిస్తిరన్నయ్య! మీరు ఎలా గిస్తి రన్నయ్య!

# పెళ్లి భేరాలు

ఇంటి మీంద సుక్క పొడిశా, నెలకోడి కూశా,
ఇంత రాత్రి ఏల కాడ ఎవ రొచ్చి నారు ?
దేవేంద్రుడు మా తండ్రీ దేవి మా తల్లీ!

,, ,, ,, ,,
సిత్తారి మేడల్లొ సీతున్నా దని

,, ,, ,, ,,
ఆ సీత నడగను మే మొచ్చీనాము

,, ,, ,, ,,
మా సీత సక్కనిది మేమీయ మండీ

,, ,, ,, ,,
అంత సక్కనోడు అయోద్య రాము

,, ,, ,, ,,
గాలి దేముడి కన్న ఘనమైన వాడు

,, ,, ,, ,,
వాయు దేముడి కన్న వరసైన వాడు

,, ,, ,, ,,
కాలు మీద కాలేసి కాంతను పెళ్లాడు!

,, ,, ,, ,,
వేలు మీద వేలేసి సీతను పెళ్లాడు!

,, ,, ,, ,,

# పెళ్లి బేరాలు

ఒక్క బిందె వరాలిస్త గుళ్లా హారీ
మా గుమస్తాకి పిల్ల నివ్వండి ,,
ఒక్క బిందే వరా లొద్దు ,,
మీ గుమస్తాకి పిల్ల నివ్వము ,,
రెండేసి బిందెల వరా లిస్త ,,
మా గుమస్తాకి పిల్లా నివ్వండి ,,
రెండేసి బిందెల వరా లొద్దు ,,
మీ గుమస్తాకి పిల్లనివ్వము ,,
మూడేసి బిందెల వరా లిస్త ,,
మా గుమస్తాకి పిల్ల నివ్వండి ,,
మూడేసి బిందెల వరా లొద్దు ,,
మీ గుమస్తాకి పిల్ల నివ్వము ,,
పదేసి బిందెల వరా లిస్త ,,
మా గుమస్తాకి పిల్ల నివ్వండి ,,
పదేసి బిందెల వరా లొద్దు ,,
మీ గుమస్తాకి పిల్ల నివ్వము ,,

# కొట్నాలు

సువ్వి సువ్వి రామచంద్ర, సువ్వి సువ్వి కీర్తిసాంద్ర,
సువ్వి సీతమ్మ మాకు శుభము లిమ్మ!

సువ్వి సువ్వి

మోదమునను పెండ్లిపీట మీద శ్రీరాము సరస
ఆదిలక్ష్మి యైన సీతమ్మను నిల్పిరీ!

సువ్వి సువ్వి

వాటమైన కుందనంపు మేటి కుందె యందు నిల్పి
గాటమైన పసిడి రోకళ్లు బట్టుక!

సువ్వి సువ్వి

రాజనములు యిప్పపువ్వు రాజనములు మంచి పునుగు
మేలు కొండ రాజనములు మేలు వంకెలూ!

సువ్వి సువ్వి

కుంది యందు నిండ నుంచి కొట్నములు దంచి రపుడు
కుందరదన లెల్ల నవ్వుకొనుచు చెలగుచు!

సువ్వి సువ్వి

# కొట్నాలు

సువ్వీ సువ్వాన రంగ, సువ్వి మోహన రంగ,
సువ్వి కావేటి రంగ సువ్వలాలీ !

భామ లెల్ల కూడెదరు పార్వతి మొదలైన,
పందిట్లో నిలిసినారు శ్రీఘ్రముగనూ ! ॥సువ్వీ॥

గౌరిదేవి లక్ష్మీదేవి జ్ఞానమైన సరస్వతి,
శశిదేవి రోహిణిదేవి చెలియ అందరూ ॥సువ్వీ॥

బంగారు కుందెనాలు పగడంపు రోకండ్లు,
చేత బట్టి దంచ రమ్మ, చంద్ర వదనలూ! ॥సువ్వీ॥

దంచ రమ్మ దౌశముగ చంచలాక్షులు మీరు
చెలియ అంత ఎడమ తొడన చెయ్యి బూనుకా ॥సువ్వీ॥

కట్ల కట్ల చీర, రైక కుట్లు ఇడువ, జవ్వనాల
కట్ల దండ, వదలు చాకట్టు మెరియగా! ॥సువ్వీ॥

చెమట లెల్ల గురియ గాను, రైక లెల్ల తడియగాను,
కుచము లన్ని వదలు నాయె కమలజాక్షులా! ॥సువ్వీ॥

దంచి దంచి సేడె లంత, దాము లేమొ కొన్న రమ్మ,
ముంచి ముంచి ఇవ్వరమ్మ, మంచి ఉదకమూ! ॥సువ్వీ॥

# కొట్నాలు

సువ్వీ సువ్వాలాల, సువ్వీ సువ్వాలాల,
రావె ఓ రుక్మిణమ్మ, రావె వో సత్యభామ,
కోరి తాంబూల మిచ్చి, కొమ్మ పిలువరే।

॥సువ్వి॥

చెలియ రావె, చేడె రావె,
    చిన్న రావె, పొన్న రావె,
వెలది రావె కొట్నములను
    వేగ దంతము।

॥సువ్వి॥

కలయ గూర్చి కరము లందు
    కంకణ ధ్వనులు మెరయ,
మెరయు టందెలును ఘల్లు
    మనగ దంపిరి!

॥సువ్వి॥

# కొట్నాలు

గట్టు మీద పండి నాయి, గరికిపూస ధాన్యాలు,
రాండమ్మ దత్తుమా, రామ కొట్నమూ ॥
మడి లోన పండినాయి, మంచి ముత్య ధాన్యాలు,
రాండమ్మ దత్తుమా, రామ కొట్నము ॥
దంచి దంచి రోకళ్లు, ధరణి పైన సేరేసి,
మంచి నీళ్లు తాగ రమ్మ, మగువ లందరు ॥
అక్కలల్ల కూడుకుని, బుక్కగుండ జల్లుకుని,
రాండమ్మ నల్ల సెరువు తాన్నాలకి ॥
సువ్వి సువ్వి సువ్విలాల, సుభద్ర రామలాలి,
రామలాలి, మేఘశ్యామ లాలీ ॥
మేనమా మిచ్చి నాడు మేలైన పట్టుసీరి,
సెంగు విరిసి కట్టరే, రంగు మీరగ ॥
మేనమా మిచ్చి నాడు మేలైన కుత్తికంటె,
కూర్చి కూర్చి గుచ్చరే, కుసుమ లిద్దరు ॥
పేరంటా లెల్ల కూడి, పెళ్లి కొట్నము దంచి,
అందరల్ల కూడుకూని, ఇక్క డుందుమ ॥
మంచి మంచి పువ్వులెల్ల, వెంచి తెచ్చూకొని,
గుతానంబు గుత్తుము, రాండమ్మా !

# గౌరి కళ్యాణం

గౌరీ కళ్యాణం వైభోగమే !
లక్ష్మీ కళ్యాణం సౌభాగ్యమే!
శ్రీరాముడు మూడు దోసిళ్ల ముత్యా లుంచి,
మాలలు మార్చిరి మహి సుతులు చూడ

॥గౌరీ॥

బాల లందరు కూడి బాల పాటలు పాడ,
కొంగు ముళ్లు వేసె వశిష్ఠు డపుడు

॥గౌరీ॥

మేటిని ఋషు లెల్ల, భూ రాజుతో జేరి,
మేటిని జను లెల్ల వేసలు యిడిరి

॥గౌరీ॥

అలివేణి తొణకంగ, హరియు సీతమ్మను
మరి బాగ చుట్టిరి పెండ్లి పందిటను

॥గౌరీ॥

తలుపులు మూసుకు పేర్లు చెప్ప మనగ,
తల వంచి సీతమ్మ శ్రీరాము డనెను!

॥గౌరీ॥

# సీతా కళ్యాణ మహోత్సవం

సీతా కళ్యాణ మహోత్సవ సమయము
చూతాము రారె, చెలీ!
రాతి నాతిగ చేసి, ఘోర
పాతకులను బారద్రోలి,
ఖ్యాతి మీరగ జనక సుతను
ప్రీతితో వరియించి నావట! ॥సీతా॥

బంగారు మణి మంటప ములలో,
శృంగార నవరత్న పీఠములపై,
రంగుగ చేమంతి చిరు లలరంగ,
దండలు కాంతి మెరయ,
పొంగి తొంగి చూచుచును - రఘు
పుంగవుడు వేంచెసె విడిదికి! ॥సీతా॥

భేరి మృదంగ కాహళములే మ్రోయగ,
వార కామిను లాడగ,
కోరి దశరథ తనయు డిత డని,
వారి జాక్షిని పెండ్లి యాడి,
తీరుగ ముత్యాల హారతి
చేరి పట్టగ, సమయ మిప్పుడు! ॥సీతా॥

# పెళ్ళి పీటలు

చిట్టి చిట్టా ఇల్లలికి
సిరి ముగ్గూ లేసి - ఓ నా రామయ్య
సిరి ముగ్గూల మీద
చిన్ని సాపాలే - ఓ నా రామయ్య
చిన్ని సాపాలే, మీద
పెండ్లి పీటాలే - ఓ నా రామయ్య
పెండ్లీ పీటల మీద
బాల లిద్దారే - ఓ నా రామయ్య
బాలూని పేరేమి ?
బాలా పేరేమి ? ఓ నా రామయ్య
బాలుడు రామయ్యా,
బాల సీతమ్మ - ఓ నా రామయ్య

# పెండ్లి తంతు

శ్రీ దేవి వంశ మందు, శ్రీ కృష్ణుడే వుద్భవించి,
ప్రాయంపు సత్య భామను పెండ్లి యాడి ॥
కోరిక దంపతులు కొంగులు ముళ్ళు వేసుకొని,
శేషాద్రి శయను డైన శ్రీ నవుతా వచ్చు ॥
శిరసు వంచుక సత్య సిగ్గాన నగుత రాగ,
శిరసూ నెత్తి శ్రీకృష్ణుడు, నవ్వుతా వచ్చు ॥
బాసింగాలు కట్టి, సత్యభామ యేలు పట్టుకుని,
గౌరీ పూజలు సేయ కదలి వత్తురు,
శివునీ నోములు నోమ నానీ కొత్తురు ॥
ఆనాడు ఇందువదన సుభద్ర తలుపులు మూసి,
నవరత్న తలుపులు మూసి,

నీ కాంత పేరు చెప్పు నిజముగ మాకు అన్న ॥
సక్కన్ని దేవి పేరు సత్య అని పిలుతు రమ్మ,
పక్కున్న నవ్వి రమ్మ పణతు లందరు
కిలకిల నవ్వి రమ్మ చేడె లందరు ॥
ఆవేళ భామలు కూడి, కొంతమంది స్త్రీలు కూడి,
నీ విభుని పేరు చెప్పు నిజముగ మాకు ॥
పేరు చెప్ప మన్నరు గాని, మగవారె యున్నరు విచట,
భగవంతుడు శ్రీ కృష్ణుడని పలికెను దేవి ॥

సేతి జాకట్లు ఇస్తా, సెనిగ పూల దండ లిస్తా,
తలుపు తీయి సెల్లెలమ్మ, తరువాయ వచ్చి ॥
సేతి జాకట్లు వున్నయి, సెనిగ పూల దండ లున్నయి,
నే, తల్పు తీయ నన్న, వాదు లాడంగ॥
పాడికి ఆవులిస్తా, పైరకు పొలము లిస్తా,
తలుపు తీయి సుభద్ర, తరువాయి వచ్చి ॥
పాడికి ఆవు లున్నయి, పైరకు పొలము లున్నయి
నే తల్పు తీయ నన్న వాదు లాడంగ॥
హస్తా మురుగు లిస్తా, అయిదు వేళ్ళ వుంగ్ర లిస్తా,
తలుపు తీయి శాంతదేవి, తరువాయ వచ్చి ॥
హస్తా మురుగు లున్నయి, అయిదు వేళ్ళ వుంగ్ర లున్నయి,
నే తల్పు తీయనన్న వాదు లాడంగ ॥
ముత్యాల వాన గురిసె, ముదితా మీ వదినె తడిసె,
అరులు తడిసె, కురులు తడిసె,
సుగంధాల కొప్పు తడిసె,
తలుపు తియ్యి సెల్లెలమ్మ, తరువాయ వచ్చి॥
రత్నాల వాన గురిసె, రమణీ మీ వదినె తడిసె,
అరులు తడిసె, కురులు తడిసె,
సుగంధాల కొప్పు తడిసె,
తలుపు తియ్యి సెల్లెలమ్మ, తరువాయ వచ్చి॥

# కళ్యాణము చూతము

కల్యాణము చూతము రారమ్మా! శ్రీ సీతా
రాముల కల్యాణము చూతము రారమ్మా !

హొయలు మీరగ తరుణు లందరు
బయలు దేరిరి హారతులతో ;
దిశలు నిండెను వాద్య రవళి,
మిన్ను ముట్టెను వేదఘోష.

కళ్యాణము చూతము రారమ్మా! శ్రీ సీతా
రాముల కళ్యాణము చూతము రారమ్మా !

కుసుమ కోమలి కొమ్మ జానకి,
అసమ శరుని శర పందపు బొమ్మ,
మారట మారుడె మా శ్రీరాముడు!
ఏరు పొగడ గల రింత వైభవము?

కళ్యాణము చూతము రారమ్మా! శ్రీ సీతా
రాముల కళ్యాణము చూతము రారమ్మా !

## మంగళ స్నానాలు

సంపంగి నూనె లంటరే! మన సీతా శ్రీ
రాములపై, వెతకి పన్నీరు చల్లరే!

సంపంగి నూనె లంటరే!
సఖియ లందరు జేరి,
సంపంగి నూనె లంటరే!

మొగలి రేకుల మడుపు లంచరె,
మగువ లందరు కూడి,
సంపంగి నూనె లంటరే!

సన్న జాజుల మాల గూర్చరె,
చెలియ లందరు కూడి,
సంపంగి నూనె లంటరే!

# గౌరీ కళ్యాణము

గౌరి కల్లరమా, ఓయ్ భాగ్యమా !
ముని జనకు పట్నాన, మున్నీ టీదుల్ని,
పాలవోయి సంబాల సావుళ్ల లోను ॥
ముడుకట్టు లంతేసి మువ్వల అరియిల్లు,
గడ్డి మేటీ లంటి గంటల అరియిల్లు,
అరియిల్లు చేయించి వంగ టేశారు,
ఇల్లు విరిసిన వారికి ఇద్దు కూతుర్ని,
బద్ద వంచిన వారికి ఇద్దు బాలని!
ఇల మూడు పట్నాన జయరేక లేసి,
వచ్చారు రాజులు వయలొగ్గి.

పర్వటు రాజులకి జయరేక లేసి - వచ్చారు -
తూరుప రాజులకి జయరేక లేసి - వచ్చారు - -
దక్షణపు రాజులకి జయరేక లేసి - వచ్చారు - -

ఇల్లు ఇరవా లేక, మల్లి పోలేక,
ఇమ్మంది పట్నాన ఇడుదు లున్నారు!
ఆ రామ లచ్చనులు అన్నదమ్ములు,
అక్కడో ఆలోచ నౌతున్నారు.

అన్నరో మాయన్న! సామి రామయ్య!
అఱ్రాంగ కుండ, బొడ్డిరవ కుండ,
బొట్టనే లరియిల్లు చోటించవయ్య!
మూడు ముక్కలు జేసి, ముంగ లేయ వయ్య!
ఆరు ముక్కలు జేసి అంగ లేయ వయ్య!
అడవిలో పచ్చాకు రామయ్య శాయ,
పండు తమలపాకు సీతమ్మ శాయ;
తామల పాకులు దెచ్చి దళ్లు గట్టారు;
బెల్ల పచ్చులు తెచ్చి పెళ్లరుగు లేసి,
సిద్దిల్లొ నూనంత సిరుగిన్నె లట్టి,
మంచి గంధము తీసి, చిలుక లేసి,
సిరుగిన్నె నూనంత సిరసు పై నెట్టి,
నలుగురు దాదులు నలుగు లెట్టారు,
పదిమంది దాదులు పట్టి నీలిపారు,
అద్దెడు నీళ్లల్లో అత్తరు గలిపి,
కుంచెడు నీళ్లల్లో కుంకాలు కలిపి,
బానెడు నీళ్లల్లో బాండారు కలిపి,
నీలాల కాంతలు నీరు పోశారు,
బ్రహ్మల్లు వచ్చారు బ్రహ్మము ల్లేశారు!

# మంగళ సూత్ర ధారణ

ఔరా రామా! సీతను పెళ్లాడితివా?
సీతను పెళ్లాడితి వౌర!
నాతికి మంగళ సూత్రము గట్టి,
ఆ సతు లందరు హారతు లివ్వగ,
నాతికి మంగళ సూత్రమె గట్టి,

॥ఔరా॥

ముత్యాలు గూర్చిన పాపిట బొట్లు,
ముఖ మంత కస్తూరి బొట్లు,
విర్రవీగుట వీర మద్దెలతొ
మెట్ల పెళ్లిళ్లే సేసి, సీతను పెళ్లాడితివ?

॥ఔరా॥

చిటి గజ్జ లందెల మువ్వలు,
సితికిన కాయల బొబ్బలి పిందెలు,
విర్రవీగుట వీర మద్దెలతొ
మెట్ల పెళ్లిళ్లే సేసి, సీతను పెళ్లాడితివ?

॥ఔరా॥

# గౌరీ కళ్యాణం

గౌరీ కల్యానా వైబోగమే!
లచ్మీ కల్యానా సౌబాగ్యమే!

గంధాలు పెట్టంగ ఎవ రెవరు సాక్షి ?
గంధాలు పెట్టంగ ముత్తైదులే సాక్షి. ॥గౌరి॥
నలుగులు పెట్టంగ ఎవ రెవరు సాక్షి?
నలుగులు పెట్టంగ ముత్తైదులే సాక్షి. ,,
బాసింగం కట్టంగ ఎవ రెవరు సాక్షి?
బాసింగం కట్టంగ బ్రాహ్మడే సాక్షి. ,,
బ్రమ్మ ముళ్లెయ్యంగ ఎవ రెవరు సాక్షి ?
బ్రమ్మ ముళ్లెయ్యంగ బ్రాహ్మణులే సాక్షి ,,
పుస్తాలు కుట్టంగ ఎవ రెవరు సాక్షి?
పుస్తాలు కుట్టంగ పెద్దలే సాక్షి. ,,
మెట్టాలు పెట్టంగ ఎవ రెవరు సాక్షి?
మెట్టాలు పెట్టంగ పెద్దలే సాక్షి. ,,
తల్వాలు వెయ్యంగ ఎవరెవరు సాక్షి ?
తల్వాలు వెయ్యంగ పెద్దలే సాక్షి ,,

# గౌరీ కళ్యాణం

గౌరీ కళ్యాణా వైభోగమే!
సేత కంకణం కట్టి, సీత పెళ్లాడ,
సైయెత్తి దణ్ణాలు బావకు పెట్టాలి! "గౌరీ"

సేత కంకణం కట్టి, సీత పెళ్లాడ,
సైయెత్తి దణ్ణాలు బావలకు పెట్టంగ, ,,

కళ్యాణం పాడంగ, గొంతెండి పాయ,
గతిలేని పెళ్లి కొడుక, గంజెత్కు రార! ,,

చిన్న చిన్న బుడ్లు, షికాయ బుడ్లు,
అపరాశి పెళ్లి కొడుక, జలిక మాడంగ! ,

చిట్టెలుక నట్టెలుక బొక్క తోడింది,
ఎల్లిర తిమ్మన ఎల్లిక సచ్చింది! ,,

అలివేణి కుండలకు అంచులు లేవు,
పెళ్లి కొడుకు అబ్బికి పెదిమలు లేవు! ,,

ఉతికిన గుడ్డల్లు మొత్త నుండాయి,
మోజైన మడియాల మూటెత్తుకు రార!  ॥గౌరి॥

వంకేది ఓ లేది ఓ పెళ్లికొడుక!
వడి కట్టు బియ్యె మియిగో ఓ పెళ్లి కొడుక!  ,,

నలుగులు బెట్టంగ నాటు నిద్దరలు,
పాటలే పాడంగ పగులు నిద్దరలు!  ,,

కుండల్లో వీబూది గుప్పటిల్లంగ,
గుంటూరు వీరయ్యె నీ వరకు వస్తాడు!  ,,

## నలుగుకు పిలుపు

భామరో, నలుగుకి
పిలవ నొచ్చారు !
సన్నాటి నడుముకి
గజ్జ లొడ్డాణము !
భామరో !

పచ్చని పందిట్లో
ముత్యాల పీట లేసి,
అత్తరు పన్నీరు
అమరి యున్నాయి !
భామరో !

పచ్చని పందిటిలో
బంగరి పీట లేసి,
సరి బాల సీతమ్మ,
సరసునితో కూర్చొనె !
భామరో !

## నలుగులు

నలుగుకు పిలువవే, నాతి రుక్మిణీ దేవీ!
నళినాక్షు దేవునకు రుక్మిణీ దేవీ!
నళినాక్షు దేవునకు!
కుంకుమ వసుపులు
కూర్చిన గిన్నెలతో,
కుసుమ లందివ్వ గాను, రుక్మిణీ దేవీ!
కుసుమ లందివ్వ గాను !
అత్తరు పన్నీరు
అమరిన గిన్నెలతో,
హంస లందివ్వ గాను, రుక్మిణీ దేవీ!
హంస లందివ్వ గాను!
గంధము కస్తూరి కలిపిన గిన్నెలతో,
కాంత లందివ్వ గాను, రుక్మిణీ దేవీ !
కాంత లందివ్వ గాను!
సెన్నా పట్నం మీన
మంచి సెండ్లు కూర్చి రంట
సెన్న కేశవులకు; రుక్మిణీ దేవీ!
సెన్న కేశవులకు !

# నలుగులు

నలుగూకు లేచిరార,
శ్రీవేణు గో పరిపాల !
పూయరా సుదతికి, కర మిదిగో, నలు గిదిగో!
సుకుమార! సుందరా కారా! ॥పూయరా॥

వచ్చన్ని వనపూ తెచ్చి,
పరిమేళ గంధము తెచ్చి, ॥పూయరా॥

నన్నాజాజులు తెచ్చి,
కృష్ణునికి హారము లేసి, ॥పూయరా॥

బొండు మల్లాలు తెచ్చి,
సత్యాకు హారము లేసి ॥పూయరా॥

అలుగాకు అన్నా, నీవు
ఈ వేళ ! మనోహర, నీవు ! ॥పూయరా॥

## నలుగులు

నలుగుకు పిలువవే, నాతి రుక్మిణీ దేవీ!
నళినాక్ష దేవునకు రుక్మిణీ దేవీ!
నళినాక్ష దేవునకు!
కుంకుమ పసుపులు
కూర్చిన గిన్నెలతో,
కుసుమ లందివ్వ గాను, రుక్మిణీ దేవీ!
కుసుమ లందివ్వ గాను !
అత్తరు పన్నీరు
అమరిన గిన్నెలతో,
హంస లందివ్వ గాను, రుక్మిణీ దేవీ!
హంస లందివ్వ గాను!
గంధము కస్తూరి కలిపిన గిన్నెలతో,
కాంత లందివ్వ గాను, రుక్మిణీ దేవీ !
కాంత లందివ్వ గాను!
సెన్నా పట్నం మీాన
మంచి సెండ్లు కూర్చి రంట
సెన్న కేశవులకు; రుక్మిణీ దేవీ!
సెన్న కేశవులకు !

# నలుగులు

నలు గిడర శ్రీ కృష్ణా !
   నవ మోహనాంగి తోను ,
చల మేలర బాలపై నీకు ?
   సారసదళ నయనా !    ॥నలుగిడరా॥

రామ ! భూసుతను అతి
   ప్రేమతో పెండ్లాడి, ఆ
కామినీమణి తోను, నీవు
   కరుణతో నలుగిడర !    ,,

శేషుని పాన్పు పై, ఆ
   చేడియతో గూడి,
వాసన గంధము నీకు
   బూసెను, నలుగిడర !    ,,

గర్విత రాక్షసుల, నీవు
   గర్వం బణచిన వాడా !
ముగుదతో ఈ వేళ, నీవు
   ముదముతో నలు గిడర !    ,,

# నలుగులు

నలుగు పెట్టుకో రారా! శ్రీ రాజగోపాలా!
భామ రుక్మిణి తోడనూ !

॥నలుగు పెట్టుకో॥

బంగారు గిన్నెలతో, పసుపు కుంకుమ దెచ్చి,
సుందరాంగ, నీకు నలుగు పెట్టేను రారా !

॥నలుగు పెట్టుకో॥

అత్తారు పన్నీరు పునుగు జవ్వాజి చేర్చి,
గంధము తెచ్చి యున్నానుర, రారా !

॥నలుగు పెట్టుకో॥

మార జనక, నీవు ఎపుడు వత్తువో యని,
తలవాకిటను నిలచి కాచి యున్నాను రార !
నిలచి యున్నానుర, రార !

॥నలుగు పెట్టుకో॥

విరిబోణు లందరు విరజాజి మొగ్గలతో,
హారము కూర్చిరి, కాచి యున్నాను, రార !
నిలచి యున్నాను, రార !

॥నలుగు పెట్టుకో॥

మదన జనక! నీవు ఎపుడు వత్తు వోయని,
తలవాకిటను నిలిచి కాచి యున్నాను, రార !
నిలచి యున్నాను, రార !

॥నలుగు పెట్టుకో॥

# నలుగులు

నలుగుకు లేచి రారా!
నారద వందిత!
నళినాయ తాక్షుడా! వినుమా!
అలివేణు లెల్ల కూడి
ఆడ వచ్చిరి కృష్ణా ! ॥నలుగుకు॥
అత్తారు పన్నీరు
అమితముగ పసుపు కలిపి ॥నలుగుకు॥
రారా, నలుగిడ, రాజగోపాల!
రారా, నలుగిడ, రమణ, వయ్యార రాజ గోపాల!
ఏరా నీకు ఇంత కోపము?
బాలుర, గోపాల! ॥రారా॥
కన కాంబర ధర! కౌస్తుభ రత్న!
కవచ కుండల ధార! ।రారా॥
వనమాలీ ధర వాసుదేవ!
బాలుర, గోపాల! ॥రారా॥

# నలుగులు

సరసిజ లోచన, దురిత విమోచన,
సర్వ గుణా భరణా!
నవరత్న పీటపై సొగసుగ కూర్చుని,
నలుగిడు మా రమణా, వేగ నీవు!

పున్నామ చంద్రుని కన్న నీ చక్కని
తిన్నైన మోము కిపుడు,
మన్నించి తిలకము మరిమరి నే పెడుదు!
మన్నింపుమా మనవి దీన బంధు!

బంగారు గిన్నెలో బాగైన గంధము
భామ నే తెచ్చితిని,
కర మిటు తే తెమ్ము గంధ మలదుటకు;
కాంతను చూచి నీవు గంధ మలదా!

పచ్చాల పళ్లెములో పసుపు ముద్దలు చేసి,
పడతి నే వచ్చితిని;
పాద మిటు తే తెమ్ము పంకజాక్ష నీవు!
పసు పలద వచ్చితి పాదములకు!

# నలుగులు

నలుగుకు రావయ్య, నందకుమారా !
ఓ నవనీత చోరా!
వేగమె రావయ్య, వేణుగోపాల !
పున్నమ చంద్రుని బోలునీ మోము,
కన్నులు కలువ రేకుల్లను బోలు,
చెక్కిళ్లు చేమంతి రేకులు బోలు,
చక్కగ రావయ్య, సరసిజ నయన!
నలుగుకు రావమ్మ, నవ మోహ నాంగి!
వెలది ఓ బామా! వేగరావమ్మ !
మంచిది దవనము, పచ్చటి పసుపు,
పునుగు, జవ్వాజి, పన్నీరు, నలుగు పెట్టేవ !
సన్న జాజులు తెచ్చి, సరములు కట్టి, మంచి
సరములుకట్టి,
సరము లందుకోవయ్య యశోద బాలా!
బొండు మల్లాలు తెచ్చి, సెండ్లును కట్టీ, మంచి
సెండ్లును కట్టీ,
సెండ్లందు కోవయ్య, వేణుగోపాల !
మంచి మల్లాలు తెచ్చి, మాలగ కట్టి, మంచి
మాలగ కట్టి,
మాలందు కోవయ్య, మదనగోపాల !

# నలుగులు

వరాలు పొయ్యండి! ఊసు లాడకండి!
దీగ్గురులు పెళ్లికి దారు లొడ్డాకండి!
గౌరి కల్లమ్మో వై భోగ్యమే ॥
జనకు జనకు నింట, పుణ్యా జనకు నింట,పుట్టిందే సీత;
జనకా జనకు నింట, మామ దశరధు డింట, పడ్డాది
సీత! ॥గౌరి॥

నీ అత్త కౌశల్య పంపింది నలుగు,
నలుగాడు సీతమ్మ నలుగాడు!
నీ మామ దశరధుడు పంపాడు నలుగు,
నలుగాడు సీతమ్మ నలుగాడు! ॥గౌరి॥
నోమి నోమల్లార నోమన్నలార!
గౌరి కల్లమ్మో, వైభోగ్యమే!
నీ అత్త భూదేవి పంపాడు నలుగు,
నలుగాడు శ్రీరామ నలుగాడు! ॥గౌరి॥
జనకముని కూతుర! దశరధుడి కోడల!
శ్రీరాము భార్య! సీతరో! దశరదుడి కోడల! ॥గౌరి॥
సీకూ్కాడు పువ్వుల్లు పూసి నెలాయె,
శ్రీరాము తలబాలు వాడివుండె! ॥జనకు జనకు॥
కాకర పువ్వుల్లు పూసి నెలాయె,
కాముడి తలబాలు వాడి వుండె! ॥జనకు జనకు॥
సీతమ్మ శ్రీరాము నలుగాడు తుంటె,
చిత్త వర్షము కురిసె భువిలోన! ॥గౌరి॥

# నలుగులు

రమ్మనవే నలుగుకి,
వాతి తోడ విభుని వేగ !

॥రమ్మనవే॥

అక్క, చూడే ! వరదుడు,
ఆది నారాయణుడు, చెలీ !

గోవులు మేపేటి
గోపాల కృష్ణుడు

॥రమ్మనవే॥

మందర ధారుడే,
మదన గోపాలుడే ? చెలీ !

గోవులు మేపేటి
గోపాల కృష్ణుడు !

॥రమ్మనవే॥

# నలుగులు

ఓయ్‌రామ! జయరామ!
సీతా రాముల ప్రేమ
భావించి పాడరమ్మ,
మన బాల బాలునకు!

కనతల్లి వాకిటిలో
కానక చూడు పీట లరసి;
కనతల్లి వేసింది
కలిమితో నలుగు!

పినతల్లి వాకిటిలో
ప్రేమతో చూడు! పసిడి
పీటల బరచి పెట్టింది,
ప్రేమతో నలుగు॥

మేనత్త వాకిటిలో
మేలిమితో చూడు! మేల్
పీటల బరచి వేసింది,
మేలిమితో నలుగు!

# నలుగులు

నలుగు పెట్టరె వదినెకు,
నాతి సుందరి బొమ్మకు! ॥నలుగు॥

దుంప కొమ్ము, పసుపుతొ,
దూల గుండాకుతో ॥నలుగు॥

మంచినూనె మడ్డితో,
మరిగేటి తారుతో! ॥నలుగు॥

సీమసింతాకుతో,
సీమ మిరప కాయతో, ॥నలుగు॥

మల్లె లమ్మ మల్లెలు,
మంచి సంపెంగలు,

గుడి సుట్టూ తిరిగేడు,
గున్నప్ప నాధుడు ! ॥నలుగు॥

రమ్మనరే నలుగుకు
నాతి సుందరి బొమ్మను !

# నలుగులు

రమ్మనవే నలుగుకీ
రాజగోపాలు నిపుడు! ॥రమ్మనవే॥

వాడికి  కాళ్లన్న లేకుంటె,
కఱ్ఱ లన్న గట్టుకూని, ॥రమ్మనవే॥

వాడికి చెవు లన్న లేకుంటె,
చేట్లన్న గట్టుకూని, ॥రమ్మనవే॥

వాడికి చేతు లన్న లేకుంటె,
తెడ్డు లన్న గట్టుకూని, ॥రమ్మనవే॥

వాడికి ముక్కన్న లేకుంటె,
ముంతన్న గట్టుకూని, ॥రమ్మనవే॥

# పెళ్లి వేడుక

పంచన కూర్చున్న వారెవరయ్యాహ, వారెవరయ్యాహ?
పంచాక్షరీ పంచాక్షరీ పంచావిదీహి !
మేమే మీ మేమే మీ మేనల్లుళ్లం మేనల్లుళ్లం మేహోయి
స్వాహ !
ఏమి కార్యానికి వస్తిరోహి ? ఏమి కార్యానికి వస్తిరోహి?
కార్యోపకారే కార్యోపకారేహే !
మీ పేరయ్యకు మన పేరక్క నిస్తురూహు !
మన కడపట బడుచుని మన కామయ్యకు మన కామక్క
నిస్తురూహు !
మన నడపట బడుచుని మన నాగయ్యకు మన నాగక్క
నిస్తురూహు !

అరు మూళ్లరిటాకు భవతి !
మూడు మూళ్ల దొప్పో భవతి!
అన్న మడిగినా లేదు, వంకాయ
కూర వండుకున్నా లేదు.
గుమ్మడికాయ కూర
గుద్దుకున్నా లేదు.
సభలో అభాసు చేసిన
వదినెగారికి బెభాస్ తాంబూలం !

# దీవెనలు

పచ్చన్ని పచ్చన్ని పందిటి లోన,
అచ్చ మావుల పేడ పచ్చంగ అలికి,
ముత్యాల ఒక ముగ్గు మూ లేర్పరచి,
రత్నాల ఒక ముగ్గు రంగేరు పరచి,
పగడాల ఒక ముగ్గు పణతేరు పరచి,
వజ్రాల ఒక ముగ్గు వనితేరు పరచి,
యాదగిరి నరసింహా! ఓ వెంకటేశ !
మీ రొచ్చి రఘురామకి శాస లెయ్యండి !
పెంచల నరసింహా! పెద ఓబులేశ !
మీ రొచ్చి రఘురామకి శాస లెయ్యండి !
శాస లెయ్య మని సెల వడిగి రండి !

# ఆనంద మానందం

ఆనంద మానంద మాయెను !
మా రాముడు పెళ్లికొడు కాయెను !
మా సీతమ్మ పెళ్లికూతు రాయెను !
జను లందరి కానంద మాయెను ! ॥ఆనంద॥
పచ్చన్ని పచ్చన్ని పందిట్లోను,
హొ వైచ్చన రాములవారు వచ్చీ కూర్చున్నారు ;
జనుల కందరి కానంద మాయెను ; ॥ఆనంద॥
జీలకర్ర బెల్లము సీత శిరస్సున బెట్టి,
సీత శిరసున బెట్టి సిరునవ్వు నవ్వినారు. ॥ఆనంద॥
తోట లంట వెళ్లినారు తమలపాకులు తెచ్చినారు,
సీత దోసిళ్ల బెట్టి సీతా శ్రీరాములవారు సిరిదండ
లాడినారు ॥ఆనంద॥
పడమటంట వెళ్లినారు మల్లేపూలు దెచ్చినారు,
సీత దోసిళ్ల బెట్టి సీతా శ్రీరాములవారు సిరిదండ
లాడినారు ॥ఆనంద॥
గోత్ర విధిన పెళ్లి, రారమ్మ సూడడానికి ఎల్దాము
రారమ్మ !
సీత శ్రీరాములవారికి తలంబ్రాలు పోసుతారు !
॥ఆనంద॥
గుచ్చిన ముత్యాలు తోరణాలు కట్టి,
గుచ్చని ముత్యాలు తలంబ్రా లేసుకుని ; ॥ఆనంద॥

# పలు దోములు

వదినారో! పలు దోముకొమ్మా! నీ
మది కోర్కె దీర్తు మే మమ్మా!

వదీనారో!

బంగారు పుల్ల గై కొమ్మా!
శృంగార వతి! వేగ లెమ్మా!

వదీనారో!

సరసము గాదె, మిటారీ!
జాగేల? లేవె, వయ్యారీ!

వదీనారో!

ధరణిలో తిరుమల వాసు
దలచు! ఆ దైవము బ్రోచు!

వదీనారో!

## పలు దోములు

ఇప్ప పుల్లా పెట్టి, తోమింతు పళ్లు!
ఈ వూరి కాలువలో, కడిగింతు నోరు!
వేప పుల్లాపెట్టి, తోమింతు నోరు!
వేలూరి కాలువలో, కడిగింతు నోరు!
తుమ్మ పుల్లా బెట్టి, తోమింతు పండ్లు!
తూమాటి కాలువలో, కడిగింతు నోరు!
మురికి కాలువ నీళ్లు ముంతెడు దెఛ్చి,
మరదలా! నీ నెత్తి చరిచి రుద్దేను!
గంపెడు భోజనము, కడివెడు చారు,
కం పుల్లిపాయలు, కావాలె వదినా ?

# పెళ్లి ముచ్చట్లు

మీన్నావా రింటోను పెండ్లి గామాలు!
పదహారు స్తంభాల పందిరి గామాలు!
పమిడి బిందెల తోను వంట గామాలు!
పదిమంది కూర్చొని భోంచేతురు గామాలు!
శోభానమే! శోభానమే!

ఏళ్లవా రింట్లోను పెండ్లి గామాలు!
ఒక్క గుంజ మీద పంద్రి గామాలు!
ఓటి కుండ లోన వంట గామాలు!
ఒక్కరే కూర్చొని భోంచేతురు గామాలు!
శోభానమే! శోభానమే!

మన్నావారి ఆడబడను సారే పంపింది!
పదహారు చీరలు, పమిడి బిందెలతో,
పసుపు కుంకంబు వెండి బిందెలతో,
అందరు మెచ్చిరి పట్నంబు లోను!
శోభానమే! శోభానమే!

ఏళ్లావా రాడ బడుసు సారే పంపింది!
మూర జాలని గుడ్డ, మురికి సలిమిడి,
ఆకులో పసుపు, చేతిలో కుంకంబు!
అది పంచ బోతేను, మాకు సిగ్గాయె!
శోభానమే! శోభానమే!

# తగని వియ్యాలవారు

మనకెక్కడ దొరకినారే ! బల్
టక్కరు లబ్బబ్బ తగని వియ్యాలవారు !

మాటలు బహు తేట, మన్ననలు ఝాట,
బైట ఆడంబరాలు, లోన లొటారాలు !

మీసాలకు అత్తరులు పూసే మంటారు గాని,
వేసాలకు లోటు లేదు, వేళకు సాపాటు రాదు !

ఎన్నో ఆభరణములు కన్య కిడుదు మని,
సున్న జుట్టిరి కద, చోద్య మొందగ !

వెండి జల్తారు చీరలు వెలబెట్టి తేలేక,
మొండి మూరెడు నెరవు మోటు చీరలు దే !

పరువు జూతా మంటె, పల్లకైనా లేదు,
కొరగాని సహాయము కోరి ఎక్కిరి !

# మోసాల పెళ్లివారు

ఎక్కడ నుంచి వచ్చి రమ్మ పెళ్లివారు,
త్రిలోక సుందర మౌళి జానకమ్మకు?

॥ఎక్కడ॥

కాకినాడ కలకటే రని అక్కా నిస్తిమి! వట్టి
బట్టలు ఉతికే వాడని ఎరక్క పోతిమి!

॥ఎక్కడ॥

మేడలు మిద్దెలు కలవా రని అక్కా నిస్తిమి!
దిబ్బల మీద తాటాకు ఇళ్లని ఎరక్క పోతిమి!

॥ఎక్కడ॥

చెన్నాపట్నం జమిందా రని అక్క నిస్తిమి! వట్టి
చెప్పులు కుట్టే వాడని ఎరక్క పోతిమి!

॥ఎక్కడ॥

# వియ్యాలవారి వర్ణన

వచ్చిరమ్మ వియ్యాలవారు !
అచ్చ మైన మర్కటముల బారు !
ముచ్చ మూతులు, కచ్చ గోచులు,
పెచ్చు పెరిగిన బుర్ర మీసలు,
అచ్చముగ కోతులను వలెనె,
గిచ్చి జగడము లాడు కొనుచు ! ॥వచ్చిరమ్మ॥

దొడ్డ వారే, పెద బావగారు!
దొడ్డి దోవన తిరిగొచ్చి నారు !
మడ్డి బావలు, ఎడ్డి మరదులు,
దొడ్డ కబురులు చెప్పు కుంటూ,
ఎడ్డి మడ్డి తనాలతో, మా
దొడ్డి నిండ కొలువు దీర ! ॥వచ్చిరమ్మ॥

జారి చెంబులు మే మియ్య బోతే,
సార ముంతలు తెచ్చియ్య మనిరి !
గౌర వంబుగ మాట లాడిన,
నోరు తెరచక ఊర కుందురు !
కారు కూతలు కూయుచును, మా
గౌరవమ్ములు కొల్ల గొట్టుచు ! ॥వచ్చిరమ్మ॥

# గడుసరి వియ్యాలవారు

దళసరి గలవార మని,
పెడసరము చూపనేల?
గడుసరి వియ్యాలవారు! చక్కానివారు!

ఉదయమున ఇడ్లీ కాఫీ
ఉప్మాలు పెసరట్లూను,
వదిలి వేసి వెళ్ళినారు! వియ్యాలవారు!

మిడసరి లగ్నంబున మీరు
మెల్ల మెల్లగ వచ్చి,
వడివడి వడ్డించ మందురే! వియ్యాలవారు!

వండిన వన్ని తెచ్చి,
పిండి వంటల వేగ
వడ్డన చేయ మందురే! వియ్యాలవారు!

భోజనా లైన పిదప;
తాంబూ లాదుల వేళ,
మాతులు త్రిప్పేదరు! వియ్యాలవారు!

# మగపెళ్లి వారి స్థితిగతులు

కంచర సామాను కలవా రని అక్క నిస్తివిగ?
కుండ బుచ్చెకి గతి లేదని ఎరక్క పోతివిగ?

ఏడు ఎకరాల పొల ముందని అక్క నిస్తివిగ?
కుంట పొలనానికి గతి లేదని ఎరక్క పోతివిగ?

ఎండి బంగారము గలవా రని అక్క నిస్తివిగ ?
చిన్నం బంగారానికి గతి లేదని ఎరక్క పోతివిగ?

ఎడ్లూ బండ్లూ గలవా రని అక్క నిస్తివిగ?
దున్న పోతులకు గతి లేదని ఎరక్క పోతివిగ?

ఇళ్లూ వాకిళ్ళు గలవా రని అక్క నిస్తివిగ?
గుడిసి పెంకుకి గతి లేదని ఎరక్క పోతివిగ ?

# పెళ్లికుమారుని వర్ణన

ఇతడేనా పెండ్లి కుమారుడు ? ఈ
అద్భుత కారు డింత సుందరడు !

**ఇతడేనా ?**

వర్ణమున కందని రూపము! వీని
హొయలు చూడ నహహా విచిత్రము !

**ఇతడేనా ?**

ఎన్నెన్నో విధముల గాత్రము ! మున్ను
ఎన్న డెరుగమె ఈ అవతారము !

**ఇతడేవా?**

పంకజ భవ నుతు డందురు, ఇతని
శంకర సఖు డని అందురు !
శంఖ చక్ర ధరుడని అందురు,
వంక లేని వాడని అందురు !

**ఇతడేవా?**

# ఏమి పెళ్లికొడుకే

ఏ దేశాన్నుం చొచ్చారయ్యా మా దేశానికి ? మా
చక్కాని శ్రీరఘు సుందరి మక్కువ తీరగ !
ఏ దేశాన్నుంచి

ఎప్పే బియ్యే చదివా రని మీవా ర్చెప్పిరి !
ఇంత ఓనమాలు రాని వారని యరక్కపోతిమి !
ఏ దేశాన్నుంచి

మేడలు మిద్దెలు కలవా రని మీవా ర్చెప్పిరి !
ఇంత తాటాగ్గుడిసెలో వున్నా రని, యెరక పోతిమి !
ఏ దేశాన్నుంచి

సిల్కు చీరలు పెడతా రని మీవా ర్చెప్పిరి !
ఇంత నూలు గుడ్డలు పెడతారని, యెరక్కపోతిమి !
ఏ దేశాన్నుంచి

కంటెలు కాసులు పెడతారని మీవా ర్చెప్పిరి
ఇంత పుస్తే బొందులు కడతారని, యెరక్కపోతిమి !
ఏ దేశాన్నుంచి

# భళీ! పెళ్లి కొడుకా!

భళి భళీ పెండ్లి కొడుక! బళ్లారి సీమలో
పుల్లాకు తూటుగ పొడిచి నాడు!

ఎద్దుచ్చ పొయ్యంగ, ఏరులై పారంగ,
తాటాకు తెప్పచే దాటి నాడు! ॥భళి॥

బావ మరదులు వచ్చి, పలుకరించగ బోవ,
కిమ్మనక పరుగు లంకించి నాడు! ॥భళి॥

చెట్టు పైకొమ్మన జేరి, కా కా యన,
అట్టె భయపడి కేక పెట్టి నాడు! ॥భళి॥

కట్ట మీదున్న గుడ్డి కొంగలను జూచి,
దయ్యాము లటంచు ఒక మూల దాగి నాడు! ॥భళి॥

అల్లు డని పిలిచి, మా నాన్న ఆదరింప,
ఎరుగకే అలిగి, తన వూరి కెళ్లి నాడు!
ఏడ దొరికాడు మాకు ఈ ఎడ్డె బావ? ॥భళి॥

# పెండ్లికుమారా !

పెండ్లికుమారా ! ఏమేమి చదివితివి ?
ఎప్ఫేలు చదివిన్నావా ? ఎమ్మేలు పాసైనావా ?

లా గుట్టు చెప్పగలవా ?
కోర్టుకి వెళ్లగలవా ? ॥పెండ్లి॥

శాస్త్రములు చదివినావా ?
శాస్త్రాదులను మెప్పించేవా ? ॥పెండ్లి॥

పది మందిలో పది
మాటలు చెల్లించేవా ? ॥పెండ్లి॥

సంగీతము నందు
సరియైన గుర్తు గలదా ? ॥పెండ్లి॥

పౌరుష చదవ గలవా ? మా
బాలను వారించ గలవా ? ॥పెండ్లి॥

# పెళ్లికొడుకు చరిత్ర

ఏమని నే చెప్పెదన్ ? ఈ
పెండ్లి కొడుకు చరిత్ర ఈలాగు నుండె నట!

ఇస్కూలు జీత మట, ఇచ్చి పుచ్చు కుంట డట,
కాఫీ హెూటల్ కెల్త డట, బాగా బోంచేత్త డట !

అత్త యింటి కెల్త డట, మత్తుగ బోంచేత్త డట,
అయిదు గంట లవ్వగానే అబ్బుల్ వోటె లంట డట!

ఈదిలోకి ఎల్త డట, దొంగ తనం చేత్త డంట,
వారానికి రెండు సార్లు జైల్లోను వుంట డట!

వాసన్ లేని సెంటు బుడ్లు మాల మాటకి రాస్తా డట,
మాట మాటకి రాస్తేను మర్యాద తక్కు వట!

అర కట్ట ఆకు లట, అర్ధ సేరు చెక్క లట,
ఏసుకోడం చేత కాదు, ఎర్రిమొగం పెళ్లి కొడుకు !

# పెళ్లికొడుకు కోరికలు

ఏమోయి పెండ్లి కొడక ఇంత కీర్తి తెస్తివి?
పట్టె మంచం పరుపు దిండు మేము ఇస్తామంటిమి;
పాత బాప పంచటరుగు నీవె కావా లంటివి!
ఏమోయి॥

చేతి గొలుసు చంద్రహారంమేము ఇస్తా మంటిమి;
నూలుపోగు నులక తాడు నీవె కావా లంటివి!
ఏమోయి॥

గ్లాస్కో పంచ ఖద్దరు చొక్క మేము ఇస్తా మంటిమి;
పాత గుడ్డ గోచి పాత నీవె కావా లంటివి!
ఏమోయి॥

బ్రాహ్మ డింటి భోజనము మేము ఇస్తా మంటిమి,
పుట్టి పిండి రాగి సంగటి నీవె కావా లంటివి!
ఏమోయి॥

లేత ఆకులు సిగిని వక్కలు మేము ఇస్తా మంటిమి;
జిల్లేడాకులు సిల్ల పెంకులు నీవె కావా లంటివి!
ఏమోయి॥

# పెళ్లికొడుకును హేళన

మరియాదగ లేచిపో, ఓ పెండ్లి కొడుక !
సభల అందరు మెచ్చిరీ,
చింపి కంబళి కప్పిరీ,
చాలగ మీ అయ్య లందరు
చాల సంతోషించిరి! మరియాదగ॥

సని దప మగ రిస, మీ అక్క లందరు
సంగీతములు పాడగ,
సభలో అందరు చూడగ,
చాటుగ మీ అయ్య లందరు
చాల సంతో షించిరి! మరియాదగ॥

# పెండ్లికూతురి పెంకితనం

పెండ్లి కూతుర!
పెంకి తన మేలనే?
పండ్లు బయట పెట్టి
ఫక్కున నవ్వుట తగున?

పెండ్లి కూతురా!

వన్నెలాడి నుడి
వయ్యార మే మందు?
ఎన్నాడు చూడము,
మేటి జాణరో! చాలు!

పెండ్లి కూతురా!

పంత మేలనే, నీ
పతి తోడ! కోమలి?
ఇంత యాగడము, ని
న్నేమందు మే మింక?

పెండ్లి కూతురా!

# రాఘవుల పెళ్లి

శ్రీ రాఘవులు పెళ్లి చేసుకో వెడలే,
చేరి తమ్ములు తాను తేరువులపై నెక్కి!

భేరి, మద్దెల, సన్న మేళము,
బూరగలు, తప్పెటల బోతు,
నగారా, ద్రాక్షా దృపల బ్రోవగ,
వార కామిను లాడ గాను! ॥శ్రీ రాఘవులు

అప్పుడు జనకరా జుల్లుళ్ల బిలువగ,
అప్పగింతలు బెట్టగ,
గొప్ప బంగరు పీఠములపై
వప్పగానే సీమించి, రాములు
అప్పు శరణము లొప్పు కొని, తా
మెప్పు మీరగ జనక రాజు! ॥శ్రీ రాఘవులు

బంగారు పళ్లెములో పాలు నెయి బోసి,
రంగుగ శ్రీ రఘు పుంగవు డను రసి
పొంగుచును, జయమంగళం బని
అంగనా మణు లెల్ల పాడగ,
మంగళాంగుల తన కుమార్తెల
చెంగటికి రప్పించె రాజు! ॥శ్రీ రాఘవులు

# గౌరీ కళ్యాణము

గౌరీ కల్యాణ వైభోగమే!
లచ్చి కల్యాణ సౌబాగ్గెమే!

పెళ్లి పెళ్లన్నాడు పెరగ మన్నాడే!
పెల్లైన్న తెల్లారి సగ్గి బగ్గోల! ॥గౌరి॥

కన్నమ్మ బాస్కాలు కదల మన్నాడే!
వోలేది, వంకేది, ఓ పెల్లి కొడుకా?
వొడి కట్టు బియ్య మేయి, ఓ పెల్లి కొడుకా?

వూరి పోయే నీల్లోయి పసుపు తోట్లోకి,
పారి పోయే మల్లోయి వుల్లి తోట్లోకి! ,,

నువు తిన్న యిత్తట్లో, మేం దిన్న యిత్తట్లో,
మత్తుంగ వుండాయి, మత్తు గల పెల్లి కొడుక!
యెత్తెయ్య రాదోరె, యిత్తట్లోయని? ,,

అలివేణి కుండలకు అంచులే లేవా?
పెల్లి కొడుకు అబ్బాయికి పెదిమలే లేవా? ,,

కల్యాణం గొట్టంగ గొం తెండి పోయె!
గతిలేని పెళ్లి కొడుకా! గంజెత్కు రారా! ,,

చెంగోడి సెట్టు కింద బాసికలు సెయ్యంగ,
గన్నేరు సెట్టు కింద కంకణా లిప్పంగ! ,,

పెల్లి కూతురు తల్లెమ్మ పేద ముత్రాలు!
సనిమకలు గొడేసి సన్నాలు పట్టంగ! ,,

# ఎంతెంత దానవమ్మ పెళ్లికూతురా!

శ్రీరాముడు గల్లవాడు పెండ్లికొడుకు;
నువు సిత్రాట లాడ బాకే పెండ్లికూతురా!

ఎంతెంత దానవమ్మ పెండ్లికూతురా!
నువు ఎంత వగల దానవమ్మ, పెండ్లికూతురా!
॥శ్రీరాముడు॥

కోదండ రాముడమ్మ పెండ్లికొడుకూ;
నువు కోతాట లాడ బాకు, పెండ్లికూతురా!
ఎంతెంత॥

బావ మరదులు గలవాడు పెండ్లికొడుకూ;
నువు భయముతొ తిరగవమ్మ, పెండ్లికూతురా!
ఎంతెంత॥

సెల్లెంద్రు గలవాడు పెండ్లికొడుకు,
నువు భయముతొ తిరగ వమ్మ, పెండ్లికూతురా!
ఎంతెంత॥

## పెళ్లికూతురి వాలకం

గిజి గిజి గూడెయ్య,
గిజి గాడు గూడయ,
టెంకాయ చిప్పయ్య,
చెలియ మోము!

ఇనుప సళాకయ,
ఎనుబోతు చర్మంబు,
గోరింట తీగయ,
కొమ్మ కురులు!

రాతి రోలుకి సరివచ్చు
నాతి నడుము,
ఊర పందికి సరివచ్చు
ఉవిద స్వరము!
కొండ ముచ్చుకి సరివచ్చు
కొమ్మ గుణము!

# బావ పొల్లులు

బావ నీదు పొల్లుల నిక పాటి సేతుర!
ఠీవి జూచి మోస పోయి భామ నిత్తుర!
బావ -

కాసు వీస మైన దేగ నోచ మైతిమి!
పేచి పెట్టి ధనము లాగు నీచు డౌసుమి!
బావ -

అన్ని కట్నముల నొసగి మా అక్క నియ్యగ,
వన్నె కల్గె గద నీదు వంశము కెల్ల!
బావ -

ధర తిరుమల వెంకటేశుని భజించక,
సరసంబులతో కాలము సరిపుచ్చుదువా?
బావ -

# శ్రీవారికి సిగ్గే లేదు

గోడ కున్న తేలుని చూసి,
గడియార మనుకునె, మా బావ!
శ్రీవారికి మాబావకి సిగ్గే లేదండీ!

మంచం కింద మడుగుని చూసి,
మజ్జిగ అనుకునె, మా బావ!
శ్రీవారికి మా బావకి సిగ్గే లేదండీ!

గొంతా లున్న రొచ్చుని చూసి,
గంజి అనుకునె, మా బావ!
శ్రీవారికి మా బావకి సిగ్గే లేదండీ!

గోడ కున్న నల్లులు చూసి,
గుగ్గి ళ్లనుకొనె, మా బావ!
శ్రీవారికి మా బావకి సిగ్గే లేదండీ!

# ఛీ ఛీ! బావలు

గోచుల్లు లేవమ్మ,
గొంగళ్లు లేవు!
ఛీ ఛీ! మా బావలకు,
సిగ్గసలే లేదు!

పెద్ద కొడుకు పెళ్లి నాడు,
పేరంటం నాడు,
పెద్ద లందరు చేరి,
పెట్టించిరి గోచి!

చిన్న కొడుకు పెళ్లి నాడు,
ఛీ కొట్లుకొట్టి,
సభవారు గుమి గూడి,
సరిదారు గోచి!

నడిపి కొడుకు పెళ్లి నాడు,
నాగవల్లి నాడు,
నా కచ్చి రాదని,
పారేశా గోచి!

## వయ్యారి వియ్యపురాలు

వియ్యపురాల! ఓ వయ్యారి లోల!
నీ వయ్యారము లెందుకే,
కయ్యాల మారి? ఓ గయ్యాళి గంప!
నీ కయ్యంబు ఇక చాలునే!

॥వియ్యపురాల!

పానకపు బిందెలు పలు దోము పుల్లలు,
పడతీరో మే మంపితే,
ఒళ్లు సొగసే కాని, పళ్లైన దోమదు!
నీ వయ్యారము లెందుకే?

॥వియ్యపురాల!

పట్టు బెనారసు చీరాలు పంపిస్తే,
పణతిరో! నీ కోసమే
చుట్టు బెంగావి చీరలు తెమ్మని,
జట్టీలు పెట్టేదవే!

॥వియ్యపురాల!

# వయ్యారి వదినా!

వయ్యారి వదినె! నీ వలగితివా? చాలు!
వెయ్యారు విత్తుము, వేవేగ యిటు రమ్మ!
వయ్యారి వదినా!

ధనమును లాగగ తగిన దానవు నీవే!
అనుమాన మేలనే? అతివరో! జాణవే!
వయ్యారి వదినా!

గడుసుదాన! మంచి గద్దరివె సుమ్మ!
ఒడు పేయగ మంచి ఓర్పు జేతువు సుమ్మ!
ధరను శ్రీతెన్నేరుపుర వేణుగోపాలు
కరుణ గోరగ, నీదు కరినంబు జూపేర?
వయ్యారి వదినా!

# వదినెల తీరులు

వదినా లందరు వెడలిరి! వయ్యారి నడకల
వదిన లందరు వెడలిరి! మిగుల సంతోషించిరి!
వగలమారి వదినె లంత, భూమి పాలించుటకు!
వదినా లందరు వెడలిరి

తెల్లవారగ లేచిరి, మావదినలు ఉల్లి తోటకు వెళ్ళిరి!
వల్లె పమిటలు వేసుకు, వెల్ల గొడుగులు పట్టుకు,
ఉల్లి పూలు ముడుచు కొనుచు, ఒకరి చేతులు ఒకరు బట్టుకు,
వదినా లందరు వెడలిరి

సరిగమ పదనిసా అనీ, మా వదినలు సంగీతము పాడిరి!
చిరతకుక్కల వలెను, చుంచు మూతులు వేసుకు,
జారు పళ్ల మీటు కొనుచు, కళ్లు చిక్కారించుకు,
వదినా లందరు వెడలిరి

# తమాషా వదినె

ఎంత దానివె వదినె! ఏం తమాషాలు చేస్తివే?
ఏం తమాషాలు చేస్తివె? నువ్వు బల్ తమాషాలు చేస్తివె!

కాకినాడ కలకటేరు, కట్లకాసుల పేరు నీకంపెనటె?
కట్లకాసుల పేరు నీకంపెనటె? కాకినాడ నిన్ను రమ్మనెనటె?

రాజమండ్రి రామారావు రవికలు చీరలు నీ కంపెనటె?
రవికలు చీరలు నీకంపెనటె? రాజమండ్రి నిన్ను
రమ్మనెనటె ?

విజయనగరం మహరాజు కోరిన చీరలు నీకంపెనటె?
కోరిన చీరలు నీకంపెనటె? కోరికొండ నిన్ను రమ్మనెనటె?

చిత్తూరు మైసూరు సాయిబు, బిస్కట్లు పేకట్లు నీకంపెనటె?
బిస్కట్లు పేకట్లు నీకంపెనటె? బ్రాందితో నిను తినమనెనటె?

జొన్నవయసుల మైసూరుసాయిబు, జోడు గుర్రాల బండి
నీకంపెనటె?
జోడుగుర్రాలబండి నీకంపెనటె? జోడుగ నిన్ను
రమ్మనెనటె?

# వదినె స్వరూపం

గజ్జల గుర్రం మా వదినె! గుజ్జు స్వరూపం మా వదినె!
వేళ్ళ కుంగ్రాల్ పెట్టింది, ఉంగ్రాల్ చూచుక పులికింది!
కాలి వేళ్ళకును పిల్లేళ్ళు, కంగున మ్రోగగ గంతింది!
చేతి కంకణాల్ చెకచెకలు, కాళ్లకు అందెల గుసగుసలు,
గజ్జల మ్రోతలు ఘల్లు ఘల్లు, బొజ్జకదపు కొని పోతుంది!
ముక్కెన ముక్కెర మెరసింది, చెవులను కమ్మలు చెలరేగ,
మెడలో హారాల్ మెలిపోగ, రావిరేకయే రంజిలగ,
రవ్వల రాగిడి రవులు కొన, రంగుల చీర, రంగుల రవిక,
టింగురంగా మా వదినె! కంగు కింగూ మా వదినె!
సింగారాల చిగురుంబోడి! బంగారంపు పసుముల లేడి!
మెడలో గంటలు, జడలో గంటలు, చేతికి గంటలు,

కాళ్లక గంటలు, గణ గణ గణ గణ!
కాలు కదిల్చితే గణ గణ గణ గణ!
తల ఆడిస్తే గణ గణ గణ గణ!
వంగుతు లేస్తే గణ గణ గణ గణ!

గజ్జల గుర్రం మా వదినె! కాని,
గుజ్జు స్వరూపం మా వదినె! కుది
మట్టు స్వరూపం మా వదినె!

# ఓ హెూ! వదినెగారూ!

ఓహెూ వదినెగారూ! వప్పుగ కూర్చున్నారు?
వయ్యారముతొ సొగసుగ కూర్చున్నారు!
ఓ హెూ ఓ హెూ॥

చక్కని వారని మిక్కిలి పొంగేరు,
ఎక్కువ ఏమి లేదు,
ఒక్కరవ్వ చక్కదన మైన లేదు!
ఓ హెూ ఓ హెూ॥

జబాబు లేదేమి? జాలి సోలి యేమి?
వీనులు లేవా యేమి?
చబాను ఇది యేమి? వినబడదా మీకేమి?
ఓ హెూ ఓ హెూ॥

ఆలోచన ఏమి? అట్లా చూచేరేమి?
జాణతనమా ఏమి?
చబాను ఇది యేమి? శక్తిహీనులా ఏమి?
ఓ హెూ ఓ హెూ॥

# ఛీ ఛీ వదినె

ఛీ ఛీ నీకు తగదె వదిన!
సిగ్గింతయు లేదె నీకు?
పేచికోరుతన మేడనే?
వాచి పోతివె పులిహోరకు!

కొత్తాన్నము, గోంగూరయు,
మీరు మీరు భోంచేస్తిరి!
మటాకుల విడెమె, చెలి,
మనసైనను లేదె నీకు?

నాగరాలు, రాగిడీలు,
రాణింపులు లేవె నీకు?
నాగరికత లేదేలనె?
నాంచారి ఓ వదిన!

టింగు రంగ రంగా యని,
శృంగారము చేసుకుని,
రోజా మల్లెల చీర గట్టి,
బజారున తిరిగేదవె?

# వదినె బహు జాణ

వదినారో మీరెంతో బహు జాన లమ్మ!
బలేవైన గోదారి గట్టు వోయమ్మ!
బరువైన బాల్చీతో తాడేయ రమ్మ!
గిర గిర తిరిగేటి గిల్క వోయమ్మ!

అరదిగ మాయింటి పెద్ద కోడలవు,
బరువైన గోదారి గట్టు వోయమ్మ!
బరువైన బాల్చీతో తాడేయ రమ్మ!
గిరగిర తిరిగేటి గిల్క వోయమ్మ!

విశాఖపట్నం దారం లేసు లల్లుటె కాదు!
బల్ వైన గోదారి గట్టు వోయమ్మ!
బరువైన బాల్చీతో తాడేయ రమ్మ!
గిర గిర తిరిగేటి గిల్క వోయమ్మ!

చెన్నపట్నం దారం బుట్ట లల్లుటె కాదు!
గిర గిర తిరిగేటి గిల్క వోయమ్మ!
బరువైన గోదారి గట్టు వోయమ్మ!
బరువైన బాల్చీతో తాడేయ రమ్మ!

# వగలాడి వదిన

వగలాడి వదిన! నీ వయ్యార మేమే?
వయ్యార మేమే, నీ వడితన మేమే?
వగలాడి వదిన -

వదిన పెద్దది, ఎంతో వల్లమాలినది,
వదిన చెల్లెలు మగని వల్ల కున్నది!
వగలాడి వదిన -

కాకా దొర నీకు కంటెంప లేదా?
కంటెంప లేదని, కనుసన్న లేదా?
వగలాడి వదిన -

కరణము మునుసబు గట్టిగ నిన్ను
పట్టుక, నెత్తుక పారి పోలేదా?
వగలాడి వదిన -

# గంధం పూతలు

సుందరాంగ! గంధము నీ
కందముగ పూసెద!
ఇందుపూల మాలను నే
అందముతో వేసెద!

సుందరాంగ

మల్లె, మొల్లలు, సన్నజాజులు,
మాల కట్టి తెచ్చెద!
మాల లోన నా వల పంతా,
ఏరి కూర్చి వుంచెద!

సుందరాంగ

జాజి కాయ, మేల్ జాపత్రి,
ఏలకులు, మరి వక్క లాకులు,
రంగ శయన! దాగ రంజిత
తాంబూలము నే నిచ్చెద!

సుందరాంగ

మొగలి అత్తరు చేరి నట్టి,
మోద మలరిన గంధము,
ముదముతొ పూసెద, నీ
కందముగ పూసెద!

# పూల బంతు లాట

పూల బంతుల నాడుటకు, నీ
  జాల మెందులకే? చెలియరో!
చాలు లేవే, వనజనేత్రి!
  చాలు నీ బిగువుల్! నగరటే?

॥జాల మెందులకే॥

ఇంతి! చామంతి పూబంతి గనవే!
  పంతమా, మంతమా, వెంత తగునా?
ఇందు వదనా! కుంద రదనా!
  విన్న నెవ రైనా నగరటే?

॥జాల మెందులకే॥

మో మొరగా వంచి, నీ భర్త నిను గాంచి,
  చిరునవ్వు దెప్పించ, మారాడ వేల?
విరస మేల? వినుత శీల!
  విన్న నెవ రైనా నగరటే?

॥జాల మెందులకే॥

## పూల బంతు లాట

పూబోణితో పెళ్లికొడుకు
పూల బంతు లాడగ,
పువ్వుబోణి చాల అలిసేను!

సన్న జాజుల సెండ్లు గూర్చి,
సతియ పైన వేసేను,
సతియ పైన ఎయ్యగ,
సతియ చాల అలిసేను !

మల్లె పూలు సెండ్లు గూర్చి,
మగువ పైన వేసేను!
మగువ పైన ఎయ్యగ,
మగువ చాల అలిసేను !

చామంతి పూలు సెండ్లు గూర్చి,
సకియ తోను ఆడగ,
సకియ తోను ఆడగ,
సకియ చాల అలిసేను !

## పూల బంతులు

పూల బంతు లాడెనే, గో
పాలుడు, రుక్మిణి కెదురుగను!

॥పూల బంతు॥

చిలకల పలుకుల, చిన్నెల వన్నెల,
చీరలు దాచిన దొంగితడు!
రవికలు దాచిన దొంగితడు!

॥పూల బంతు॥

పక పక నవ్వే కృష్ణ స్వామి!
పాలు తాగిన దొంగితడు!
పెరుగులు తాగిన దొంగితడు!

॥పూల బంతు॥

## బంతు లాట

పూల బంతు లాడెనే, బాల రుక్మిణి, కృష్ణుడు,
మే లైన బంగారపు మేడ లోపల నేడు!

పూల బంతు

బాల సంతసముగ నీలవేణు లెల్ల చూడ,
భేరి మృదంగములు భోరున మ్రోయగ,

పూల బంతు

వర కామిను లెల్ల వచ్చి, నాట్యములు సేయ,
విరజాజులు, మల్లెలు, సరసిజ సుమములు,
చలము సాధింప నీకు చాలుర! గోపబాల!

పూల బంతు

తాళజాలర సామి! తామస మేలర నాపై నింత?
ఆట లాడి, పోర వలదుర, సారస నేత్ర!
గోటుగ నీటుగ చెండాట లాడ రోయి!

పూల బంతు

# పూచెండ్లాట

సెండ్లూ పూలూ దెచ్చి, సెండ్లు గుట్టెదరా !
సెంద్రుడ ! నా సేత సెండండు కోరా !
ఏనాద ఏనాద

ఏ నాద ! ఏ నాద ! ఏను గోపాల !
ఏ గ్రంగ రావయ్య ఏను గోపాల !
॥ ॥

మల్లెపూలు దెచ్చి, మొగ్గ కుట్టేద !
బద్రూడ ! నాసేత సెం దండుకోర !
॥ ॥

బంతిపూలు దెచ్చి ! బంతి కుట్టీద!
బద్రూడ ! నాసేత బం తందుకోర !
॥ ॥

మల్లేపూలు దెచ్చి, మొగ్గ కుట్టేద ।
బలబద్రా! నాసేత బం తందుకోర !
॥ ॥

# బంతు లాట

మల్లెపూల సెండు మగువ కేసి చూడు!
బాలికామణిరో! బంతు లాడుదామా?

శ్రీకృష్ణా నీకు నే చిన్నదాన్ని, స్వామి!
అంగజాక్షి నాపై అలిగే నేమొ గాని!
॥శ్రీకృష్ణా॥

బంతిపూల సెండ్లూ భామ కేసి చూడు!
బాలికామణిరో! బంతు లాడుదామా?
॥శ్రీకృష్ణా॥

అల్లిపూల సెండ్లు అతివ కేసి చూడు!
బాలికామణిరో! బంతు లాడుదామా?
॥శ్రీకృష్ణా॥

# వామని గుంటాలు

ముత్యాల యామని గుంటల పీట లేతమా?
పీట లేసి, రాములవారి ఆట నూతమా?

రాము లోడెనా? సీతమ్మ ఓడెనా?
సీతమ్మవారి ముఖమంత చిన్న వోయనా?

పగడాల యామని గుంటల పీట లేతమా?
పీట లేసి రాములవారి ఆట నూతమా?

రాము లోడెనా? సీతమ్మ ఓడెనా?
సీతమ్మవారి ముఖమంత చిన్నవోయనా?

చెలియ, నీ సేతి లోనె కొబ్బ రున్నదీ! ఆ
కొబ్బ రన్న అందుకోర, నందకుమారా! నవనీత చోరా,
చెలియ నీ సేతి లోనె కజ్జుర లున్నవీ! ఆ
కజ్జుర లన్న అందుకోర నంద కుమారా! నవనీతచోరా!
చెలియ నీ సేతి లోనె పోక లున్నవీ! ఆ
పోక లన్న అందుకోర, నందకుమారా! నవనీతచోరా!
చెలియ నీ సేతి లోన ఆకు లున్నయీ! ఆ
ఆకు లన్న అందుకోర, నందకుమారా! నవనీతచోరా!

# బువ్వం పంక్తి

చూడ నెంతో శృంగారము! సుదతిరో!
సీతా రామచంద్రుల బువ్వము!
చూడ నెంతో శృంగారము!

హెచ్చైన అరిటాకులు తెచ్చి వేసినారట!
చెప్ప శక్యము కాదటే! సుదతీరో! సీతా
రామచంద్రుల బువ్వము

సన్న బియ్య పన్నా మట, వన్నె మీర సూప మట,
ఎన్నొ ఎన్నొ కూర లట, కన్నెరో వినవే!
రామచంద్రుల బువ్వము!

వడ లంటె వడ లట, కడ లేని హెూళీ లట,
నడుమ నడుమన మండియల్, మందయాన వినవే!
రామచంద్రుల బువ్వము!

# బువ్వం పంక్తి

సీతారాముల బువ్వము చూతాము రారె!
ఖ్యాతిగ మిధునాధిపు డగు జనపతి నగరికి!
సీతారాముల

ఎంతో చక్కదనమె చూడ, ఇంతిరో నేడు!
భ్రాంతి తీరగ నిపుడు బంతికి నిపుడు!
సీతారాముల

సృష్టి పాలకు డైనట్టి సీతారాములను,
నిష్టతో ప్రార్థించి రపుడు, నేర్పు మీరగను!
సీతారాముల

జలనిధి గంభీర! రామచంద్రా! రావయ్య!
సలలిత సద్భక్త హృదయ సదయ! రావయ్య!
సీతా ు ములు

వాసవ వినుత! ముని మనోల్లాస! రావయ్య!
సలలిత సద్భక్త హృదయ సదయ! రావయ్య!
సీతారాముల

# బువ్వం పంక్తి

బువ్వము బంతి చూడగ చోద్య మాయె!
రాముల బువ్వము ఏమని పొగడుదు?
భామరో। చోద్య మాయెను, ఈ మదిని!

నన్నపు బియ్యము అన్నము, లడ్డు, పేణీ,
చిన్ననీ పొడికూరలు, సూపములు, ఈ మదిని!

బంధువు లొక్క బంతి, బ్రాహ్మణు లొక్క బంతి,
సుందరాంగు లెల్ల ఒక్క బంతి, ఈ మదిని!

చక్కెలా లతిరసాలు, చక్కని ఆమవడల్,
చక్కెరా కజ్జకాయలు, ఈ మదిని!

అప్పడాల్ వడియాలను, అంది అంది అడిగేదరు!
కుప్పళించి దూకేదరు, కొంచమైన వడ్డించరు!

పొట్టి వదినె, తాను బల్ తట్ట వలె కొప్పు బెట్టి,
వట్టి వళ్లెం చేత బట్టి, భక్ష్యా లనీ వరుగుల్ తోలే!

# బువ్వం పంక్తి

ఇంతీ వినుడీ బువ్వము బంతీ ఘనమే మించెదే!
ఎంతవారే మాతో వీరు వంతు గాను చేసినారు!

॥ఇంతి॥

ఆరాకు లంతేసి అరిటాకులను వేసి నారు!
కూర లేక ఒక్క రవ్వ ఊరి పిండి రాల్చినారు!

॥ఇంతి॥

పాచి పండ్ల బావగారు పప్పో యని పాటించగా,
పప్పు లేదు, కూరా లేదు, పచ్చ డైతే వుంది కాని!

॥ఇంతి॥

సుండలను తిన నోల్లని, తండుల ప్రసాద మట!
వండి వార్చి నామే సద్ది, వడ్డించుకోమన్నా రట!

॥ఇంతి॥

నల్ల మామనై వడ్డించా, బల్ నాణ్య గాడు వచ్చినాడు!
మిళ్లి తడి గానివ్వడు! మీద బొట్టు పడనివ్వడు!

॥ఇంతి॥

# విందు వింతలు

వైశాఖ మాసాన వచ్చె లగ్నమ్ము,
వల్లభుడు మా బావ మిల్లి వేయించా!

మిల్లి తడి గాకుండ, బొట్టు బడకుండా,
నేర్పుతొ మా వదినె, నెయ్యి వడ్డించా!

వైశాఖ మాసాన

ఆకాశ మార్గాన, ఆ గాలి వచ్చి,
ఆ కాస్త బడకుండా యెగరేసి పాయా!

వైశాఖ మాసాన

అప్పడం లేదాయ, వడియమే లేదు,
వట్టి కూరకు మేము వాచి వచ్చితిమా?

వైశాఖ మాసాన

అప్పడం వున్నాది, వడియ మున్నాది,
కండ్ల గానక మీరు గడ్డి దిన్నారు!

వైశాఖ మాసాన

# పెళ్లి విందు

ఏలాగు భోంచేతుము? ఈ
విందు మేమేలాగు భోంచేతుము?
చాలా పెండ్లిండ్లాయె! ఈలాటి విందుమేము
॥ఏలాగు భోంచేతుము?॥

విస్తళ్లు వేశారు, జానె డేసి వెడల్పు!
హస్తంబు కలుప కూడ, ఔరౌర చోటులేదు!
॥ఏలాగు భోంచేతుము?॥

ముక్క బియ్యము వండిరీ,
దాని లోకి ముద్ద పప్పే వేసిరీ,
చెప్పుకుంటే సిగ్గౌతుంది!
చెయ్యి కడిగితే జిడ్డే లేదు! ॥ఏలాగుభోం చేతుము?॥

కూరే వంకాయ కూర!
దాని లోకి మరే పచ్చడి లేదు!
కలహంబులే కాని,
కార్యంబు లేనే లేదు! ॥ఏలాగు భోంచేతుము?॥

లడ్డూ జిలేబీల పాకముల,
మడ్డీ తేలిందంట!
వడ్డించే వదినేగారి
వడ్డాణం జారిపోయే! ॥ఏలాగు భోంచేతుము?॥

## విచిత్ర విందు

విందు చేసినారు, వియ్యాల వారింట్లో !
విందు మాట చెబితే, వింతగా వుంటుంది!

విందు చేసినారు

పప్పే వుడకక లేదు, చారే మరగ లేదు!
అరటికాయ పప్పు అసలే వండ లేదు!

విందు చేసినారు

బూరులై తాండేరు, బుట్టలతో పెట్టేరు,
బద్ధకాలు చేత, బంతే సాగిచ్చేరు!

విందు చేసినారు

గొప్పకి వారిళ్ల అప్పడా లొత్తేరు
బద్ధకాము చేత, బంతే సాగిచ్చేరు!

విందు చేసినారు

నేతి సొంబులు, పట్టి, మూ తేమొ మూసేరు!
సెయ్యే తడవ లేదు! సెప్పుకుంటే సిగ్గూ!

విందు చేసినారు

# వియ్యాలవారి విందు

విందు చేసినారు, వియ్యాల వారింట్లో !
విందు మాట చెబితే, వింతగా వుంటుంది !

॥విందు॥

పొట్టి బావగారు కొట్టు పెత్తన మంట!
కొట్టులో సరకులు ఇవతలకు రానీరు !

॥విందు॥

అత్తగారు వచ్చి పళ్లెం తట్టినాది !
మామగారు వచ్చి మటమట లాడేరు!

॥విందు॥

పెద్ద బావగారు మేళం వద్ద నుండె !
వదినగా ర్లంతాను నట్టింట బోయేరు !

॥విందు॥

# వియ్యాలవారి విందు

విందూ వియ్యాల వారి
చందాము తెలుపుటకు,
అందరి కానంద మౌనౌనా!
వీరు ఎంతో గొప్పవా రట! ॥విందు॥

కూరే వంకాయ కూర,
వేరే మరేమి లేదు!
అడిగిన వెయ్యరు, పెళ్ళివారు!
వీరు ఏంతో గొప్పవా రట! ॥విందు॥

అరిసె లైతె వండి రట,
అటుకు లైతె కొట్టి రట,
అడిగిన పెట్టరు, పెళ్ళివారు!
వీరు ఎంతో గొప్పవా రట! ॥విందు॥

ఆకు లైతె తెచ్చి రట,
వక్క లైతె తెచ్చి రట,
తాంబూల మివ్వరు, పెళ్ళివారు!
వీరు ఏంతో గొప్పవా రట! ॥విందు॥

మగ పెళ్లివా రట!
కోటా వారట!
పెళ్లికి తర్లి వచ్చినారు!
వీరు ఎంతో గొప్పవా రట! ॥విందు॥

# విడెములు

కపురంపు విడెములను కాంత తెచ్చిచ్చేను !
కరుణతో చేకొనర ! కస్తూరిరంగా !
॥కపురంపు॥

ఏల, లవంగములు, జాజి పలములు, మంచి
జాపత్రియ తెచ్చి, సరగున తెచ్చిచ్చేను !
॥కపురంపు॥

అత్తరు, పన్నీరు, అగరు, చందనము,
మెత్తని మేనందు సిస్తుగ అలదన్ !
॥కపురంపు॥

కురువేరు, దవనము కూర్చిన సరములు,
కుంతి మాధవ ! నీకు కాంత తెచ్చిచ్చేను!
॥కపురంపు॥

# విడెములు

రారా! మన్నరు రంగా! తేరా, సెయి తేరా !
కుందనంపు కూటమున కూర్చుండవయ్య !

రారా !

చిగిని పట్టు పొడి, చిగురుటాకులు,
ఆణిముత్యము, అవిరిన సున్నం,
జాజికాయ, జాపత్రి, ఏలకులు,
ఇడిమి చుట్టించి, ఇవి,
జోడించి పణతి చుట్టించె !

రారా!

వక్షస్థలమున లక్ష్మీదేవి,
వరము లీయును సంతోషముతో,
నిండు పూర్ణిమ పాడ్యమితోను,
వెల్లు బరచిన చంద్రుని కళతో,
పారిజాత పూబంతులతో,
విరిబోణి మా రుక్మిణీదేవి
ఇప్పుడు నిన్ను భావించునురా!

రారా !

# శ్రీరామ! పేరు చేపుమా!

శ్రీరామ నీభామ పేరును చెపుమా!
సతి పేరేమొ చెపుమా!
ఆపేరును చెప్ప విన కోరితి మయ్యా!
ఆ మాట విని, రాముడు, భూమేశు డనియే!
ఏమి నా సతి పేరు ఎప్పుడు విన లేదా?
విన్నామొ, లేదొ, ఆ విధము నీకేల?
కన్నడ శాయ, కలికి పేరు చెపుమా!
సతిపేరు చెప్పితే సకల లోకములు
అపహాస్య మొనరించు ననియ!
లోకంబు లన్నియు లో మీరే కద?
ఈ రాత్రి ఈ పగలు ఏలా గడిపెదరు?
బెదరించితె మే మెంతొ బెదరంగ పోము!
మా మగువ పేరిట చెప్పక మరి తల్పు తియ్యము!
లోకంబునకు నీవు లోలుడవు కావ?
లోకం బేమందురు? లోపాకారుడవు!
ప్రొద్దు కుంకే! మాతోటి పను లేటికి?
ముద్దూల గుమ్మ యని వేవేగమె చెపుము!
లలనా మణులార! ఆ లలన పేరు వినుడీ!
నాసతి పేరు చెప్పెదను సీతా యని! వినుడీ!

## సీతమ్మా! పేరు చెప్పమ్మా!

సీతమ్మ! నీభర్త పేరు చెప్పా వమ్మ,
సేతు మాధవుని తోడను? మే
మెంతోను వెలగుచు వినియెదము!

సీతమ్మ !

నాపతి పేరు తెలియ కున్నా! వున్నదా?
వేరే పేరు మీరు విన కోరి నా
రెంతా కూరిమితో! వినుడీ!

సీతమ్మ!

కౌశల్య కుమారుడు నా విభుడు!
కౌశల్యా సుతు డని, కలికి! మాకే దెలుసు!
వేరే పేరే వున్నది; అది చెప్పక దీరగ గదె, సుమతీ!
వేరే పేరు మీరు విన కోరినా రెంతా!
కూరిమితొా వినుడి ; శ్రీరామ చంద్రులు! నేను.

సీతమ్మ!

## పెళ్లికొడక! పేరు చెప్పు!

సీ॥ పేరు చెప్పు మటన్న పెదవుల తడిపేవు;
పార పండ్లన్నియు బయట పడున?
పేరు చెప్పు మటన్న మారు బల్క వదేమి?
నత్తియా, నంగియా, నాల్క కురచ?
పేరు చెప్పు మటన్న పెడ చెవిం బెట్టేవు;
బధిరత్వ మెల్లను బయట పడున?
పేరు చెప్పు మటన్న ఓరగా జూతువు;
గారాబమా లేక కనుల తీర?

గీ॥ పారపండ్లైన, నత్తైన, బధిరమైన,
గారబం బైన, తప్పునా? కాన, ఇపుడు
నీదు కేల్ పట్టి నిలిచిన నీరజాక్షి
పేరు చెపుమా, వేవేగ, పెండ్లికొడక!

# శోభనం

బంతి పువ్వులు దెచ్చి,
పాసువు పైని దాలిచి,
కురులు పైని తా బోసి,
సొలునా, రాముని భాగ్యం
సీతకు సొలునా ?
నింపతీ నింపతం,
నింపతం గలవారి సంపతం
వలపుల రామయ్యకి,
వనిత సీతమ్మకి శోభనం !
పట్టపు రామయ్యకి,
పణతి సీతమ్మకి శోభనం !

# శోభనాలు

పచ్చని పచ్చని పందిళ్ల లోన,
పచ్చని ధనుకోళ్ల పట్టె మంచాలు

-శోభనాలో!

ఆ పటె మంచాల నేతేమి నేతో!

-శోభనాలో!

ఆరి ఇంటి ఎనకాల ఎలగోగు సెట్టు,
ఎలగోగు నారల్లు తీసి మడ లేసి,
మడిసిన ఆ నార మడ దొక్కినారు!
సీకట్నీ ఆ నార సీరేసినారు!
ఎన్నెల్నీ అనార ఏండేసినారు!

-శోభనాలో!

సుబద్ర సేతుల్ని పేనిన్న నులక!
వాద మాడి నేశారు అన్న దమ్ముల్లు!
పంత మాడి నేశారు బావ మరదుల్లు!
తరక మాడి నెశారు తండ్రి కొడుకుల్లు!

-శోభనాలో!

ఆ పట్టె మంచాల నేతేమి నేత?
కాళ్ల కాడ కడి ఎండి రేకుల్ల నేత;
బొడ్డున పొన్నారి పువ్వుల్ల నేత;
తలకాడ తామరి పద్మమ్ము నేత,
వల్లి లొత్తా కుండ మల్లిలే పోశారు!

శోభనాలో!

మల్లి లొత్తా కుండ ఇల దూదిపరు పేశో!
తూరుపు గదుల్లు, పడమటి గుమ్మాలు,
గాజుకాయ పటె మంచం గళ్లన్ని ఏసి,
ముప్వల్ల దుప్పటి ముసుగార గప్పి,
నాలుక్కాళ్ల కాడ నాలుగు దీపాలు!

శోభనాలో!

ఆ పట్లె మంచాల ఎవరు పండారు?
సీతమ్మ శ్రీరాము కలిసి పండారు!
సీతమ్మ వళ్లంత సిరు సెమట లోసె!
ఇసర వోయి రామయ్య, ఇసినిగర్రలతో!
ఇసిరినా పోదమ్మ ఈ పుది సెమట!
ముసిరినా పోదమ్మ ముత్యాల సెమట!

శోభనాలో!

# తలుపుల దగ్గర

కృ - శ్రీదేవీ! నే శ్రీ రంగేశుడ!
చే కొని తలుపులు తీయవె! నను
లో కొని తలుపులు వేయవె!

॥శ్రీదేవి॥

భా - వన్యాగ్న్న యప్పముగ మ్రింగిన
వాడవు నీవు గదోయి?

॥శ్రీదే వెందుకు?

వట్టి నేరములు రెట్టించక,
చే పట్టి యేలుకో తరుణీ! నను
గుట్టు బెట్టకే, తరుణీ!

॥ శ్రీదేవి॥

భా - వట్టి మాటలని యెట్లు బల్కెదవు?
గట్టిగ దెల్పెద వినుమా! నీ
దిట్ట దనము హో గనుమీ
శ్రీదే వెందుకు? చేకొను టెందుకు?
చర్చ లేల, పోవోయి!

॥శ్రీదే వెందుకు?

కృ - అన్యాయపు నిందలు నాపై నిడి,
అగడు చేతు వటె, భామా?
నీమగని గానటె లేమా?

॥శ్రీదేవి॥

భా - అన్యుల మగడవు అయి నీ
వుండగ, జగడ మేల, పోపోయీ!
అగడ లేక పోపోయీ!

॥శ్రీదే వెందుకు?

కృ - అన్యము నీకం టెరుగ నటుంచును,
అగ్గి పెటెదనే, చెలియా! మద
నాగ్ని నణపవే, చెలియా!

॥శ్రీదేవి॥

# తలుపుల దగ్గర

భా - వాకిట నిలుసుని వగలు బలికెవు,
వన్నెకాడ! పోవోయి కృష్ణా!
వన్నెకాడ! పోవోయి!
గోయిందుడ వని, సక్కని దేహాము,
గోళ్లు కందె నేమోయి, కృష్ణా?
కృ - గోవర్ధనగిరి పరవత మెక్కితే,
ఎండల కాకే, భామ, అది!
భా - కర కంరుడ వని, కమ్ముల దుప్పటి,
కాటుక మర కేమోయి. కృష్ణా?
కృ - కాటుక మరకలు కావే, భామరో!
నీటుగ జవ్వాయి పూలే, అవి!
భా - పద్మనాభుడ వని పై పచ్చడము
పసుపు లంటె నేమోయి, కృష్ణా?
కృ - పసుపు మరకలు గావే, భామ!
నీటుగ జవ్వాయి పూలే, అవి!
భా - అర్ధము రాత్రి నిద్ర పొద్దున,
ఏడి కెళ్లి నావోయి, కృష్ణా?
కృ - జోడు కూడి కోలాటము లేస్తుంటే,
అవి జూడ బొయ్యానే, నేడు!
భా - అవతల వీధిని రుక్మిణి యున్నది!
అటు తిరిగి పోవోయి, కృష్ణా!
కృ - రుక్మిణి నే నెరుగ, దానిల్లు నే నెరుగ,
దారి జూపవె, భామ, నీవు!

# తలుపుల దగ్గర

తలుపు తియ్యవే తరుణిరో! రాధ!
కలికీ! చిన్న కృష్ణుణ్ణి!
కాళింగ మర్దనము గావించి, వేగ
యిందు వచ్చితినీ!
తలుపుతియ్యవే!

నందకుమార! నవనీత చోర!
పొందుగానె పోపోర!
సుందరి రుక్మిణి అందుండె ఎడబాసి
ఏల వచ్చితివీ?

వటపత్ర శయన! వారిజ నేత్ర!
ఎచ్చటి కైన పోపోర!
పదహారు వేల గోపిక స్త్రీలను,
కూడిన వాడవుర!
నందకుమార!

# తలుపుల దగ్గర

కృష్ణ - తలుపు తీయగ రావే, భామిని!
తలుపు తీయగ రావే, శ్రీమణి!

||తలుపు||

మల్లె దండలు దెచ్చి యుంటినే!
మగువరో గైకొన మంటినే!
పల్లవ పాణిరో! పంత మేల నాపై?
ఇంతీ! పూల బంతీ!

||తలుపు||

భామ - టక్కరి వాడవు నీవుర! నీ
చక్కటి మాటలు చాలుర!
వందన మందును, గోవింద, నీకు!
వారిజాక్షుల కడకు పోకుర!

కృ - సతులలో ముద్దుల రాణివే! నా
మదిలోన ప్రేమంపు రాణివే!
వన్నెలాడివి నీవు! ఈ
విరహ మోర్వనె, బాలా!

||తలుపు||

# తలుపుల దగ్గర

కృష్ణావతారు డొచ్చి, కిలకీలొ నిలిసినాడు !
మాలచ్మి, తలుపు తీయవే!
సీతా జయలచ్మీ! తలుపు తీయవే!

కృష్ణావతారుడు రాలె; కిలకీలొ నిలవ లేదు ;
మా లచ్మి - - - - - - - తలుపు తీయనే!

మశ్చావతారు డొచ్చి మడుగుల్లొ నిలిసినాడు!
మా లచ్మి - - - - - - - తలుపు తీయవే!

మశ్చావతారుడు రాలె, మడుగుల్లొ నిలవ లేదు,
మా లచ్మి - - - - - - - తలుపు తీయనే!

బుద్ధావతారు డొచ్చి, భూమిలో నిలిసినాడు!
మా లచ్మి - - - - - - - తలుపు తీయవే!

బుద్ధావతారుడు రాలె, భూమిలో నిలవ లేదు,
మా లచ్మి - - - - - - - తలుపు తీయనే!

## తలుపుల దగ్గర - సంవాదం

కృష్ణ - తల్లియశోద తనయుడ నేను
తలుపు తీయవే భామ! నాకు -తలుపు-

భామ - తలుపు తీయమని కులుకుచు బలికేవు
తలుపు రాదు పోవోయి! కృష్ణ! -తలుపు-

కృష్ణ - ముచ్చు సోమకుని పిచ్చుణగించిన
మశ్చ మూర్తినే భామ ! నేను -మశ్చ-

భామ - మశ్చమ వైతే మడుగులో నుండక
ఇచ్చట పనియేమోయి ? కృష్ణ ! -ఇచ్చట-

కృష్ణ - గర్వితుడగు హిరణ్యకశిపు ద్రుంచిన
నరహరినే - ఓభామ ! నేను -నరహరి-

భామ - గర్వముతో నీవు నరహరి ననెదవు
కారడవికి పోవోయి! కృష్ణ- కారడవికి-

కృష్ణ - కూర్మంబైతే నే కుధరము మోసిన
కూర్మ మూర్తినే ! భామా ! నే -కూర్మ-

భామ - కూర్మంబైతే బురదలో నుండక
ఊరక పనియేమోయి ? కృష్ణ ! -ఊరక-

భామ - పల్ల వాధరుల ఇండ్లు తిరిగి ఇటు
మెల్లగ వస్తివోయి కృష్ణ! -మెల్లగ-

కృష్ణ - ఎవ్వరి ఇంటికి పోవగలేదు
రవ్వ బెట్టకె భామ! నను -రవ్వ-

# తలుపుల దగ్గర

తినేటి గిన్నె లిస్త, తాగేటి సెంబు లిస్త !
అక్కోళ్ల రాంబాయి ! తలుపు తీయవే !
తలుపు తీయవే !

తినేటి గిన్నె లొల్ల, తాగేటి సెంబు లొల్ల,
అక్కోళ్ల రాంబాయి-! తలుపు తీయవే !
తలుపు తీయవే !

కట్టె సీరా లిస్త, తొడిగే రైకా లిస్త,
అక్కోళ్ల రాంబాయి ! తలుపు తీయవే !
తలుపు తీయవే!

కట్టే సీరా లొల్ల, తొడిగే రైకా లొల్ల !
అక్కోళ్ల రాంబాయి ! తలుపు తీయవే !
తలుపు తీయవే!

# అప్పగింతలు

సీతమ్మా ! మా అత్తవారింటి కేగి,
భూతల మందున ఖ్యాతి చెంద వమ్మ !
సీతమ్మా !

అత్త మామల యెడల అణకువతొ మెలగి,
ఉత్తమ సతి వని అనిపించు కొమ్మ !
సీతమ్మా !

పతి సేవ లనయమ్ము అతి భక్తితో సలిపి,
పతి కరుణల నంది, పేరొంద వమ్మ !
సీతమ్మా !

# అప్పగింతలు

పోయి రావమ్మ మా తల్లి !
పోయి మీ అత్తింట బుద్ధి కలిగుండు!
॥పోయి॥

గడపపై కూర్చుండి, జడ విప్ప బోకు!
కూర్చు న్నప్పుడే, తల్లి, కురులు దులుప బోకు !
॥పోయి॥

వెండి మట్టెల కాలు, ఎత్తి నడవకుమ !
నడచి నప్పుడే, తల్లి, చేయూచ కమ్మా !
॥పోయి॥

మగవారిని చూచియు, మగువ, నవ బోకు !
తగవు లాడే చోట, తల యెత్త కమ్మా !
॥పోయి॥

పతి కంటె ముందు లేచి, పను లెల్ల దీర్చి,
పతి పాదముల సేవ, భక్తితో సేయుమా !
॥పోయి॥

# అప్పగింతలు

రావె చిలకల కొలికి, రత్నంపు కలికి!
  రావె రత్నపు కొలికి, కన్నుల్లా కొలికీ!
ఎవరి సౌమ్మ్యైతివే వయ్యారి నువ్వు?
  అవుగాని, నువు మాకు బలిమి ఏదమ్మా?
నీ అత్త, నీ మామ, నిన్నేమ నంటే,
  మాకు బలిమే దమ్మ, మారు మాట్లాడ?
ఏకాంత మని నీకు ఎన్ని చెప్పేను?
  చెలియ ఎవ్వరితోను ఎరిగించ బోకు!
గారాల కూతుర్ని కౌగిట చేర్చి,
  తల్లి కౌగాలించి కన్నీరు వొలిపే!
ఎనిమి దేళ్లు పెంచి ఈ కన్య నిపుడు,
  వదిన నీ కప్పగిస్తి మోయమ్మ!
పాలలో ముంచెత్త, సేత ముంచెత్త,
  బంగారు బొమ్మ వలె చేతి కందీయ,
బంగారు పళ్లెము లోను పాలు నెయి బోసి,
  ఆ కాంత చెయ్యద్ది, చేతులో వుంచి,
హస్త కంకణాల సీతను దెచ్చి,
  ఆ రామ చేతిలో చెయ్యప్పగించి,
సురటిపూ కడియాల జానకిని దెచ్చి,
  కౌశల్య చేతిలో చెయ్యప్పగించి!

మట్టెలు పిల్లేళ్ల మగువను దెచ్చి,
కైకమ్మ చేతిలో చెయ్యప్పగించి,
సురటి పూకడియాల జానకిని దెచ్చి,
శాంతమ్మ చేతిలో చెయ్యప్పగించి,
చేతులు చైవేసి, తను కౌగలించి,
కుసుమశర గంధి తన కూతు రప్పగించే!

కుందనములు దెచ్చిరి, మకర కుందనములు!
వశిష్ఠు, హనుమాన్లు, పేరావరించిరి!
పువ్వులు, బుక్కాలు, బగ్గుండాలతో,
రాముడు సీతను దండాడగాను!
మానెడు సోలడు ముత్యాలు దెచ్చి,
వడి బియ్యము దెచ్చి, తల్లి వడి గట్టె!
కందపిలక వేసి, తల్లి వడి గట్టె!
ఉగ్గు గిన్నె వేసి, తల్లి వడి గట్టె!
పాలు గాచ నేరదు, బాల సుమీ, వదిన!
నెయ్యి గాచ నేరదు, నెలత సుమీ, వదిన!
బుద్ధు లెరుగదు, మంకు బుద్ధులే గాని!
బుద్ధి వచ్చిన దాక, దిద్దుకో వదిన!
ముత్యాలు భాషికం అల్లాడగాను,
పడతిని పలుమారు తిరిగి చూడగను!

## తలుపుల దగ్గర

కృష్ణుడు - ఏమే భామ! వాకిలి తీయవు?
ఇంటి లోపలికి వచ్చెదనే! బామ!
ఇంటి లోపలికి వచ్చెదనే!

భామ - నీ మొగ మెరెగను! చీకటిలోన
ఎందు కొచ్చెద వోయి కృష్ణ?
ఎటునుం చొచ్చితి వోయి, కృష్ణా?
నీ వెవరవొ చెప్పవోయి?

కృ సరగున వేదంబులు భువి దెచ్చిన
జలచర పతినే, భామ! నే
జలచర పతినే, భామ!

భా జలచర పతి వైతే, కృష్ణ!
జలధి కడకు పోవోయి, కృష్ణ!
జలధి కడకు పోవోయి!

కృ మందర గిరి నా మూపున నిల్పిన
కూర్మ రూపినే భామా! నే
కూర్మ రూపినే భామ!

భా - కూర్మ రూపుడవు నీవైతే, కృష్ణ!
కొండ కడకు పోవోయి, కృష్ణ
కొండ కడకె పోవోయి!

కృ - రాక్షసుడౌ ఆ రావణు ద్రుంచిన
రాముడనే, గుణధామా! నే
రాముడనే గుణధామ !

భా - శ్రీరాముడ వైతే మేలాయెను!
సీత కడకు పోవోయి, కృష్ణ!
సీత కడకు పోవోయి!

కృ - పాపడనై నే గోవుల గాచిన
గోపాలుడనే కొమ్మా! నే
గోపాలుడనే కొమ్మా!

భా - గోపాలుడ వైతే మేలాయెను!
గొల్ల మందలకు పోవోయి, కృష్ణా!
గొల్ల మందలకు పోవోయి!

కృ - చిట పట చినుకులు దుప్పటి తడిసెను,
తలుపు తీయవే, భామా!
చల మేలనే, సత్యభామా?

# ఒడి నింపరే

ఇందుముఖికి, సుందరాంగికి,
ఇప్పుడే వడి నించరే !

॥ఇందు॥

అలరు గంధం, పునుగు, జవ్వాజి,
తత్తర మెడ బుయ్యరే !

॥ఇందు॥

మామ దశరధ దెచ్చినది,
మామిడిపండ్లు వడి నించరే !

॥ఇందు॥

కాజు, కజ్జూర, నారుకేళీ,
కాంతకు ఒడి నించరే !

॥ఇందు॥

బావ దెచ్చిన బంతి పువ్వులు,
భామకు వడి నించరే !

॥ఇందు॥

మరది దెచ్చిన మల్లె పువ్వులు,
మగువకు వడి నించరే !

॥ఇందు॥

# అప్పగింతలు

వదినరో! నా పుత్రి ఇది, ఒప్పగింతు!
పదిలంబుగను బెంచ, భారంబు మీది!
    పాలతో పుత్రి, నీ పాలు చేసితిని!
    ఏలాగు బెంచెదరో, ఈ నారీమణిని!
ఎన్ని వ్రతములు నే నోచి కంటి, నా
కన్నతల్లిని! బెంచ కర్తలు మీరు!
    కన్నీరు విడకమ్మ, కనకంపు బొమ్మ!
    మాయమ్మ, సీతమ్మ! పోయి రావమ్మా!
తలవాకిటను నిలచి, తల విప్ప బోకు!
ఎగువతొ మగవారు తలలెత్తి చూచెదరు!
    పొరుగిల్లు బోకమ్మా, పోరాట మొచ్చు,
    అత్తమామలు ఆడబిడ్డలుతోను!
కాలెత్తి ఘల్లు ఘల్లు నడువ బోకమ్మ!
పదిమందిలో మనకు పలచవు నమ్మ!
    పతికన్న ముందర, పవళించ కమ్మ!
    సంధ్యవేళలో నిద్ర చాలించ వమ్మ!
భూమిలొ పర పురుషులు ఎందరో, కొమ్మ!
అన్నదమ్ముల వలె భావించ వమ్మ!
    పతి కన్న వేరొక్క గతి లేదు, కొమ్మ!
    పతియే దైవంబని భావించ వమ్మా!

# అప్పగింతలు

అత్తవారింటికి అంపించెదము నిన్ను !
అతి బుద్ధి కలిగుండు మా సీతమ్మ !

ఉత్తమ గుణముల గొప్పగ బోదలచు,
ఉల్లాసమున నుండుమా ! సీతమ్మ!

మణులు మించిన నారీ మణులు మీ సెల్లెండ్రు !
మన్నించి కూడుండుమా ! సీతమ్మ !

మానినీ! అత్తమామల యందు
విశ్వాసముగ నుండుమా ! సీతమ్మ !

భూనాథు డైన నీ పురుషుడు, రాముడు !
పూని గొలుచు చుండుమా ! సీతమ్మ !

గుణవంతు లైన ముగ్గురు మరుదు లున్నారు !
కొడుకుల వలె చూడు, మాదు సీతమ్మ !

మురియుచు శ్రీరామస్వామి సేవలో,
నిరతముగ నీ వుండు, మాదు సీతమ్మ !

# తలుపుల దగ్గర

దండమురా, కృష్ణా! దండముర నీకు !
దండము పెట్టెద, దారిడరా! కృష్ణ !

దండ మంటే బహు గండమే, ఓ చెలి!
దండము పెట్టిన దారిడనే! భామ!

నగధర! నీ సరి మగవారితో వాదు,
తగదెల్ప, నే పసి దాననురా! కృష్ణ !

పసిదానవా నీవు పైమాట లాడేవు!
పసిదాని కేల ఈ పౌరుషము ? భామ !

పౌరుష మాడేటి పణతు లచ్చట నుండ,
వారిజాక్ష! నాతో వాదేలరా? కృష్ణ !

వాదించి నేను యీ వసుధలో ధృష్టుల
భేదించి నానే, ఓ చెలి; వినవే! భామ !

శేష శయన! శ్రీరావూరి పుర వాస!
ఆరడి సేయుట మేలటరా? కృష్ణా!

# అప్పగింతలు

జనకుండు ఆ వేళ తన సతితో కూడి,
తన బిడ్డలను చాల దయతో పిలచి,
కలికి సీతమ్మ ! చుక్కవు పైడి బొమ్మా !
చిలుక పలుకుల యింతి! చెంగల్వ బంతి!
శృంగార మైన తన సెల్లెంద్ర తోను,
అంగనామణి జానకమ్మ, తావచ్చె.

అతివేగ దశరథుని, అతని భార్యలను,
కుతుకంబుతో పిలిచి కూర్చుండ బెట్టి,
పొసగ కౌశల్యను పూజించెను, బాల.
కన్నీరు కారంగ, కడు చింత తోను,
చిన్న మా సీతమ్మ చై పట్టి తాను,
చెలు వైన కౌశల్య చేతులో బెట్టి,
పలికె నప్పుడు, తాను బహు వేడుక గొనుచు.
వరసతో వినవమ్మ, వదినె, కౌశల్య!
ఎరుకతో నీకు నేను, ఎన్ని చెప్పుదును;
పడతి సీతమ్మ, పసిబిడ్డ సుమ్మి!
ఎదుట నుండగ నేను ఎడబాయ నమ్మ!

ఈ చిగురు బోడిని, నాయింటి యందు,
నా చేతులతో పెంచినా నమ్మ, వినుము !
కాంత, మాణిక్యాలు గల తొట్లొ పెట్టి,
వింత గురియల బంతి, వేళ్లాడ గట్టి,
బాల నందను లెల్ల, పండుకో బెట్టి,
లాలి జోలలు పాడి, లాలించు కొనుచు,
ఆడించి నానమ్మ, అంబాడు దాక!
కడియమును, గజ్జెలును, కాళ్లకును గట్టి,
నడవ నేర్పితి నమ్మ, నాతి కొన్నాండ్లు,
అత్తత్త యని మాట లాడ నేర్పితిని!
ఇత్తరంగున పెరిగె, ఈ బాలామణి !
బాల ఏడిచిన వేళ, బొబ్బలు పెట్టి,
బాల నే లాలించి, సంతోష పడితి,
వరుసతొ వినవమ్మ, వదిన, కౌశల్య !
ఎరుకతొ నీకు నేను, ఎన్ని చెప్పుదును !
పడతి, ఈ సీతమ్మ పసిబిడ్డ సుమ్మి!

# అప్పగింతలు

సుకుమారి నెటు జూతువో! ఇది
సుమశరు చేతి ప్రసూనపు హెూతి!

—సుకుమారి నెటు

పూల గోయగ, చెయ్యి పొక్కు, మాయమ్మకు!
మేలు లతా గాత్రి మాతోన చేరె!

—సుకుమారి నెటు

పన్నీరు నించు నప్పటికి, తాపము జేయు!
కన్నెల మిన్న, చక్కని ముద్దుగుమ్మ!

—సుకుమారి నెటు

చిలుకకు పద్దెము చెప్పిన, శ్రమ నొందు!
అతివ నీలవేణి అంబుజ పాణి!

—సుకుమారి నెటు

# సారెలతో అప్పగింతలు

ఏనుగుల మీదనే,
సారె లొచ్చినవి !
ఎత్తు పిర్రల వదినె !
సారందు కోవె !

గుర్రాల మీదనే,
సారె లొచ్చినవి !
గుండు పిర్రల వదినె!
సారందుకోవె !

పెరుగు బువ్వలు పెట్టి,
పెంచుకో వదిన !
సల్ల బువ్వలు పెట్టి,
సాదుకో వదిన !

# అప్పగింతలు

సీత పన్నెండేళ్ల లేత సుమ్మా, సామి!
పసి బాల సుమ్మి!
కసి కాయ సుమ్మి!
రతి కేళి సుమ్మి!
లాలించి మే లెంచి, మే లెంచి మెల్లిగ,
మే నంద వల సామి!
మోహంపు ముని జడ లాల సుమ్మి!
ఆమె మూలము తెలియని ముద్దు సుమ్మి!
పతి వని నీ మేన పంత మాడే టపుడు,
సింత వలదు సామి! -సీత-
తండ్రి మేన తాను ముద్దు సుమ్మి!
తండ్రి మేన తక్కింపు లెక్క సుమ్మి!
పతి వని నీ మేన పంత మాడే టపుడు,
సింత వలదు సామి! -సీత-
అరటి బోదె లాటి అతివ సుమ్మి!
ఆమె పలుకులే తియ్య నొలుకు సుమ్మి!
పలుకు పంచదార సిలుకులతో మవ్వ
పలు కంద వల సామి! -సీత-

# అప్పగింతలు

అత్త, అన్నా మని పెట్టిన్న దాకా,
అత్త అన్నా మని అడగ బోకమ్మా !
వాలచిన రోకళ్లు దాట బోకమ్మా!

ఇంట్లోన అనుకున్న రాస్యంబు మాట,
ఇరుగు పొరుగుల తోటి, ఇల నాట బోకు !

బావ మరదుల తోటి, భయముతో నుండు !
తోటి కోడళ్ల మాట తోసేయ బోకు !
ఆడ బిడ్డల మాట అడుగు దప్పకు !

మామ దశరథ కేమొ మరి సేవ చేయి!
అత్త కౌశల్యకు అర కాళ్లు వత్తు !

కాటిక్కాయ వడిగట్టి, గంధ మొడిగట్టి,
బొట్టు పెట్టీ గట్టి, బొమ్మ నొడికట్టి,
మా తల్లి లక్ష్మీదేవి, పోయి రావమ్మా !
పోయి మీ అత్త యింట్లో బుద్ధి కలి గుండు !

మా దొడ్డి లోపల బంతి పూలుండై!
బంతిపూలు పెట్టి జళ్లేసె దెవరు?

చిట్టి గుజ్జని గూడు వెట్లొండు కోనె?
అటెవ్వ రాడేరు తల్లి మా సీత?

చిట్టి బొమ్మరిల్లు ఎట్లేసు కోనె?
అటెవ్వ రాడేరు తల్లి మా సీత?

మా తల్లి లక్ష్మీదేవి, పోయి రావమ్మ!
పోయి మీ అత్త దిల్లో, బుద్ధి కలిగుండు!

# అప్పగింతలు

అత్తగారర వమ్మ! ఆరడి శాయ కమ్మ!
వత్తులు వత్త కమ్మ, వత్తిగి లుండవమ్మ!

॥అత్త॥

కొడుకును కన్నా నని, కోమలి, పొంగ కమ్మ!
కొడుకును కన్నా వార్కి, గోడ పంచలే నమ్మ!

॥అత్త॥

అత్తగార్లూ కూడ, వెనుక కోడళ్లే నమ్మ!
జ్ఞప్తికి తెచ్చుకుంటె, జ్ఞానము వచ్చు నమ్మ!

॥అత్త॥

నీవలె నేనూ వస్తి, నిజముగ నమ్మ వమ్మ!
కొడుకుతో చెప్ప కమ్మ, కోడరిక ముంచ కమ్మ!

॥అత్త॥

సరి సరి గాను వుంటే, పడిపడి దండా లెడుదు!
సిరి దప్పి తిరిగితే, పిడికెడు అన్నా మమ్మ!

॥అత్త॥

# అప్పగింతలు

అమ్మ నిన్ను పంపెద,
అత్తవా రింటికి!
ఎత్తి యురమున చెలీ,
ఏమి సేతునే బాల?
ఇన్ని ఏళ్లు పెంచి, నిను
బహు అన్యాయ మొనర్చి
పరుల పాలు చేయుటకు,
వరములు వేడితిని!
బొమ్మరిళ్లు కట్టుకుని,
బొమ్మలాట లాడుచున్న,
చిందులు తొక్కేటి
చిన్నతల్లి నెట్లు మరతునే?
బాలికా మణిరో! నిన్ను
బాలు నైన చేయక,
బాలగా చేసెనే, బ్రహ్మ!
ఆ బ్రహ్మ నేమ నందునే?

# అప్పగింతలు

పతివ్రతా ధర్మంబు
పాటించు కోవే!
పతి చేత నీ కాళ్లు
పట్టించు కోవే!
మొగుడు నీతో వచ్చి
ముచ్చట లాడితే,
పగదాని వలె మీద
పడిపోవె, తల్లి!
తమలపా కుచ్చుకు
తా నొక్క టంటె,
తలుపు చెక్కుచ్చుకు
తల మీద కొట్టు!
ఇరుగు పొరుగు
వారు నిన్నేమ నంటె,
ఇంటికి చిచ్చెట్టి,
లేచి రావమ్మ!

# అప్పగింతలు

పది నెల్లు మోసి, పన్నెండేండ్లు సాకి,
పన్నెండేండ్లు సాకి, పరుల సేతి కిస్తి!

ఒప్పగించి తమ్మ, ఒప్పాదల, కృప!
నిను గన్న భాగ్యాన, ఏముంది తల్లీ?

నువ్వు ఆడె బొమ్మ లాట, ఎవరు ఆడె రమ్మ?
ఎవరు ఆడె రమ్మా? ఎల జూతు మమ్మా? ॥ఒప్ప॥

నువ్వు గట్టె సీరల్లు ఎవరు గట్టె రమ్మ?
ఎవరు గట్టె రమ్మ, ఎల జూతు మమ్మ? ॥ఒప్ప॥

నువు తొడిగె రైకలు, ఎవరు తొడిగె రమ్మ?
ఎవరు తొడిగె రమ్మ, ఎల జూతు మమ్మ? ॥ఒప్ప॥

నువు బెటె సొమ్ములు, ఎవరు బెట్టె రమ్మ?
ఎవరు బెట్టె రమ్మ, ఎల జూతు మమ్మ? ॥ఒప్ప॥

పది నెల్లు మోసి, పన్నెండేండ్లు సాకి,
పన్నెండేండ్లు సాకి, పరుల సేతి కిస్తి! ॥ఒప్ప॥

# అప్పగింతలు

వదినారో! నా పుత్రి, నప్పగించితి నమ్మ!
కొట్టక, తిట్టక, కోపగించక, తల్లి!
కండ్లాతో బెదరించి, కడుపులో దయ లుంచి!

॥వదినారో॥

సద్దీ అన్నము పెట్టి, సాదుకోండ్రి తల్లీ!
ఉడుకు అన్నము పెట్టి, వుంచుకోండ్రి తల్లీ!
పెరుగు అన్నము బెట్టి, పెంచుకోండ్రి తల్లీ!

॥వదినారో॥

దోసకాయ కొడువాలి సేతి కిచ్చిన, తల్లీ!
కోసీన నీ దయ, వుంచీన నీ దయ!
నంపీన నీ దయ, సాదీన నీ దయ!

॥వదినారో॥

# అప్పగింతలు

అప్పగించితిమి ఒప్పుల కుప్పని!
నిన్నప్పగించితిమి !
తొమ్మిది నెలలు మోసి, కంటి నమ్మ!
అమ్మరో నిను గన్న భాగ్య మేది తల్లీ ? ॥అప్ప॥
చిట్టి బొమ్మలాట ఇక నెవ్వ రాడేరు?
అమ్మరో, నినుగన్న భాగ్య మేది, తల్లీ? ॥అప్ప॥
భర్తన్న మాటకు, భక్తి గా నుండమ్మ!
బావ మరదుల మాట, మారు మాటాడకు! ॥అప్ప॥
అత్తమామల మాట కెదురు మాట్లాడ కమ్మ !
ఆడ బిడ్డల యందు, అతి భక్తిగా నుండు! ॥అప్ప॥
వీధిలో కురు లిప్పి, కన్నెత్తి చూడకు !
పదిమందిలో కెళ్లి, పన్నెత్తి నవ్వకు! ॥అప్ప॥
నెయ్యి గాయ మా సీత, నేరదే తల్లి!
నీ బిడ్డ సాక్షిగ నేర్పుకో వలెను! ॥అప్ప॥
పన్నెండేండ్లు పెంచి, మీకు అప్పగించితిమి !
బరువు భారము అంత, మీదేను, మాతల్లీ! ॥అప్ప॥

# అప్పగింతలు

కోడి కుయ్యగ, లేచి, దీపంబు బెట్టి,<br>
　　కన్య పైనము చేసె, పల్లకీ దెచ్చి!<br>
పైనంబులు రేపు పసుపు కుంకాలు,<br>
　　భక్తితో తమ తల్లి, సీత వడి నుంచె,<br>
దొంతుల భరిణలే, నిలువు టద్దాలు,<br>
　　దోమతెర మంచాలె, తూగు టుయ్యాల!<br>
ఆడ బడుచుని పంపి, యింటికి వచ్చి,<br>
　　ఇల్లెల్ల చూసుకు, హడలె, జనకుడు!<br>
ఆడ బడుచుని పంపి, యింటికి వచ్చి,<br>
　　హడల రాదందురే! అది మాకు వశమా?<br>
బొమ్మరి ళ్లన్నియు పొలు పమర బట్టి,<br>
　　ఇక నెవ్వ రాడేరె తల్లి మా యింట?<br>
లక్క పిడతల నిండ పప్పమర బోసి,<br>
　　ఇక నెవ్వ రాడేరె తల్లి, మా యింట?<br>
చీటికి మాటికి డబ్బు లిమ్మనుచు,<br>
　　ఇక నెవ్వ రాడేరె తల్లి మా యింట?

# మంగళహారతి

శృంగారముగ సీతకు మంగళ సూత్రము కట్టి,
శృంగారవతిగ నీకు మంగళ హారతు లివిగో!

సీతారామ జానకి జయ మంగళం!
సీతారామ జానకి శుభ మంగళం!

ముని వంటి తట లోను, తాటాకు ముదువ ముడిచి,
ముని వంటి సాధ్వి! నీకు ముత్యాల హారతు, లివిగో!
॥సీతారామ॥

జీలకర్ర, బెల్లము, సీత శిరసున బెట్టి,
సీతా శ్రీరాములవారు చిరునవ్వు నవ్వే రంట !
॥సీతారామ॥

మూడోది నామము పోకండ అమర జేసి,
నారాయణమూర్తులకు, మేలైన హారతు లివిగో!
॥సీతారామ॥

# మంగళ హారతి

హారతి గైకొను అమర నాయక!
అశ్రిత పాల! శ్రీరామచంద్ర !

||హారతి||

శివుని విల్లు విరచి, సీతను పెండ్లి యాడి,
పరశురాముని భంగ పరచిన శ్రీరామ।

||హారతి||

లక్ష్మణ సోదర! తక్షణం బేగియు,
ఈ స్థితి లోన, ఇక దయ చూడు।

||హారతి||

అహల్యా శాప విమోచన విహార !
సీతా మనోహర। శ్రీరామ చంద్ర।

||హారతి||

# మంగళ హారతి

మంగళ మమ్మ, మా యమ్మ, సీతమ్మతల్లీ!

జనక రాజు పుత్రికవై,
జానకి యను పేరు తోడ,
శ్రీకరు డగు శ్రీరాముని
ధర్మపత్ని వైన నీకు,
మంగళ మమ్మ, మా యమ్మ, సీతమ్మతల్లీ!

లంక రాజు రావణుండు,
లంకకు గొనిపోయి మిగుల,
అష్ట కష్టములు పెట్టె!
అన్ని యోర్చిన తల్లీ!
మంగళ మమ్మ మా యమ్మ, సీతమ్మతల్లీ!

నీ మహాత్య మెరిగి, స్త్రీలు,
నిన్ను బోలు పతివ్రతలు,
ఈ పుడమిని కలకాలము,
ఇంపుగ వర్ధిలుదు రమ్మ!
మంగళ మమ్మ మా యమ్మ, సీతమ్మతల్లీ!

# మంగళం

మానినిరో! మాధవునకు
మంగళం బని కొనియాడగ,
మానవతులు కూడి, వేగ
దీన జనుల బ్రోవు మనుచు !
గాన లోల, గారవించు ! ॥మానినిరో॥

మకరి చేత జిక్కి, హరి
మొరలు పెట్టగా, తికమకలై,
సకలాత్ముడు వేగవచ్చి,
సకలానుత శస్త్రమున
మకరి ద్రుంచి, కరి గలసిన! ॥మానినిరో॥

అంబ, తపసి వెగటు బుద్ధి,
అంబరీషుని శపియింపగ,
డంబ మనుచు చక్రం బంటి,
కుంభినీ తనయార్చితులకు,
సంభ్రమమును కలిగించును! ॥మానినిరో॥

తులువ లైన కౌరవులు,
వలువ లొల్వగ, కరుణ గల్గి,
కలత దీర్చి, పిలువక తా తరలి వచ్చి,
వలువ లిచ్చి, వగ బాపిన ! ॥మానినిరో॥

# మంగళం

పీట మీద గజ్జల్లు, పిరికిటి అంబుల్లు,
రాత్రిళ్లు నే గంటి రామ కలలు!
కోట సుట్టున రెండు కోగిళ్లు కుయ్యంగ,
నవ్వుత సీతమ్మ నగరి కెళ్లగను!

మంగళం మంగళం, మాధవా నీకు!
మంగళం మంగళం! వారికి జయ
మంగళం మంగళం!

అందంగ కౌశల్య అయోధ్య నుండంగ,
మంగళసూత్రము సేయు మరియాదగ!
సేసింది కౌశల్య, సేతాళపడి పెట్టి,
శృంగార మంపరే, సీతమ్మ మెడకు! ॥మంగళం॥

జీలకర్ర, బెల్లాము, అది మూడు దోసిళ్లు,
సీతమ్మ శిరసున అంటే టప్పాడు,
భరత శత్రుఘ్నులు వారన్న దమ్ములు,
భక్తితో సైపట్టి కంకణం కట్టు! ॥మంగళం॥

రత్నాలు, ముత్యాలు, అవి మూడు దోసిళ్లు,
సీతమ్మ శిరసున పోసే టప్పుడు,
సీతమ్మ శిరసున పోసే టప్పుడు,
రామయ్య శిరసున సీతమ్మ బోసు! ॥మంగళం॥

కుంకుమ బరిణాలు, కాటిక కాయలు,
ఎండీది సిక్కెంటె, పమిడి దువ్వెన,
ఇన్ని సొమ్ము లిచ్చే, అభరణ శాలలో!
ఒప్పుకో రామయ్య తప్పులు మావి!

॥మంగళం॥

వంటెద్దు కొమ్మంట, వొల్లంత నలుపంట,
పాదాలు తెలుపంట, బసవన్నకు!
పంచవన్నెల ముగ్గు, పళ్లెములో బోసుకుని,
అవు పెయ్య నిచ్చి అంపరాదమ్మ!

॥మంగళం॥

# మంగళం

తల్లిగా రింటికి తావాయె, గౌరమ్మ !
అంతట్లో ఈశ్వరుడు పిలువ నంపె!
సారెకు, సన్నబియ్యంపు సద్దులు,
సఖియరో, గౌరుకు పంప వలెను!

జయ జయ మంగళం!
నిత్య శుభ మంగళం!

ఆడు పిల్ల వని, అన్ని నీ కిచ్చిరి,
అల్లుని కేమి అరుణ మిచ్చిరి?
సన్నసన్న ముత్యాలు, బంగారు తాంబూలం,
సందు సందున కెంపు దాప లేదా?

జయ జయ మంగళం!
నిత్య శుభ మంగళం!

ఆరతీ గంటలు, గురు పూజ పుస్తకం,
బంగారి నాగసరం, ఈయ లేదా?

జయ జయ మంగళం!
నిత్య శుభ మంగళం!

పుట్టి నింటికి గౌరు, పోయి వస్తివి గాని,
ఏమేమి తెస్తివో, చెప్పవలె నాతోని, సిగ్గు పడకా.
మావారు పేదవారు! మా కేమి కలదయ్యా?
ఒప్పుకో, శివరాజ, తప్పు లేరక!

జయ జయ మంగళం!
నిత్య శుభ మంగళం!

# మంగళం

జయ మంగళం ! జయా శుభ మంగళం !

అంచన, అలివేణి ఆనంద మాడగ,
పంచన, అలివేణి పంత మాడు !

నిగ నిగ మెరిసేటి నిండు పందిట్లోను,
నిలిసెనే అలివేణి నిశ్చలంగ !

జయ మంగళం ! జయా శుభ మంగళం !

ఆ పాడు మిట్టన, పల్లేరు కాయల్లు !
ఉద్ది పువ్వుల సెండ్లు, పద్దకొండు !

ఒక సేత వుంగరం, ఒక సేత బొంగరం,
ఒక సేత వుద్దగిరి కంకణం !

జయ మంగళం ! జయా శుభ మంగళం !

# వియ్యపురాలికి మంగళం

మంగళం, జయ మంగళం!
మా వియ్యపురాలి నడతలకు
మంగళం, జయ మంగళం!

॥మంగళం॥

ప్రేమతో నే వియ్యపు రాలికి,
అరటి పండు ఇస్తే,
తొక్కతో మింగి, కక్కుకొనే!

॥మంగళం॥

చింతమాను చిగురే చూడు!
వియ్యపురాలి నుదురే చూడు!
పందిట్లో స్తంభా లన్నీ, గడగల్లాడే!

॥మంగళం॥

వియ్యపురాలు తులసి పూజ కెడుతుంటే,
పైట జారి కింద పడే!
అన్న వచ్చి, పైట సర్దే!

65064

॥మంగళం॥